# శ్రీరామవిజయము

ఇది

ద్రోణంరాజు సీతారామారావుగారిచే

రచియింపఁబడి

రాజమండ్రినివాసులును బుక్కుసెల్లర్సు నగు

కర్రా అచ్చయ్యగారిచేఁ

ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు 1,000.



కాకినాడ:

స్కేపు అండ్ కో ముద్రాక్షరశాల

న్ముద్రింపబడియె.

1913.



[వెల రు 0—8—0

# పీఠిక.

నాచే రచింపఁబడిన శ్రీరామచరిత్రసంబంధమైన నాటకములలో నిదివరకు శ్రీరామోద్యోగంబును, శ్రీరామాశ్వమేధంబును ముద్రింపఁబడియున్నవి. ముద్రింపఁబడిన నాటకములలో నియ్యది మూడవది. తక్కిన రెండునునగు శ్రీరామజననంబును, శ్రీరామ ప్రవాసంబును ద్వరలోనే ముద్రణకాగలవు. ఈ శ్రీరామవిజయము చదివిన ప్రతి వారికిని వేణీసంహారనాటక కథాకల్పన (Plot) జ్ఞాపకము రాకమానదు. ఇందలి గుణాగుణంబు లరయుభారము పండితప్రకాండులకే విడిచి పెట్టినాడను.

26-11-1913.

ఇట్లు సుకవివిధేయుఁడు
బ్రో॥ సీతారామరావు.

# ఈనాటకమునందువచ్చు పాత్రములు.



శ్రీరాముఁడు—కథానాయకుఁడు.

లక్ష్మణుఁడు—రామునితమ్ముఁడు.

సుగ్రీవుఁడు—రామునిదండనాయకుఁడు.

హనుమంతుఁడు—రామునిభక్తుఁడు కపీశ్వరుఁడు.

రావణుఁడు—దైత్యనాథుఁడు.

కుంభకర్ణుఁడు—రావణునితమ్ముఁడు.

సుపార్శ్వుఁడు
మహోదరుఁడు } దైత్యులు.

మాల్యవంతుఁడు—రావణునకు నీతిబోధించిన దైత్యవృద్ధుఁడు.

మణికంధరుఁడు—రావణునిగొల్చు వార్తావాహుఁడు.

విభీషణుఁడు—రావణునితమ్ముఁడు శ్రీరాముని జేరినవాఁడు.

(ఇంకను సారథులు కంచుకులు మొదలగువారు)

## స్త్రీలు.

మండోదరి—రావణునిభార్య.

నర్మద—చెలికత్తె.

మైత్రేయి—రావణునిమంత్రికిఁదల్లి.



# శ్రీరామవిజయము.

నాంది.

మ॥ ధరణీభారనివారణంబునకు దై ♦ త్యశ్రేణిఁగూల్పంగ ; భా
స్కర వంశాంబుధి పూర్ణచంద్రుఁడగుచున్ ♦ జన్మించి ; ఘోరాజిలో
సురవైరిన్ దశకంఠుఁ గూల్చి త్రిజగ ♦ త్క్షోభంబువారించి యి
ద్ధరఁ జెన్నొందిన రామదేవుఁడిఁడు గా ♦ తన్ మీకు సౌభాగ్యముల్.

(నాంద్యంతమున)

సూత్ర—ఆహా! నేఁడెంతయుసుదినము. నాపూర్వపుణ్యంబునంజేసి, యీసభాసదులచేఁ బవిత్రమైయొప్పు వీరరసప్రధానమగు నాటకము ప్రదర్శించవలయునని యాజ్ఞాపింపఁబడితిని. కాని, ఏచరిత్రము ప్రదర్శించుటకును నూహాపోహమకున్నది. అయినను దీనింగూర్చి పారిపార్శ్వకునితో నాలోచించెదఁగాక. (ప్రక్కఁజూచి) పారిపార్శ్వకా! నీవొకసారి యిటురమ్ము.

[పారిపార్శ్వకుఁడు ప్రవేశించి] దేవా! ఏమిసెలవు?

సూత్ర—ఈసభ్యులను పవిత్రమై వీరరసప్రధానమైయొప్పునాటకం బెద్దియైనఁ బ్రదర్శించి యీసమయంబున నానందపఱుపవలయును. ఏమినాటకము ప్రదర్శించినచో బాగుగనుండునోయని నీతోడనాలోచించుటకుఁ బిలిచితిని.

పారి—అయ్యా! మీరు నాయందుంచు కృపచే నట్లడిగితిరిగాని, మీకంటె నాకెక్కువ తెలియునా! అయినను నడిగితిరిగాన జెప్పక తప్పదు. శ్రీరామవిజయ నామనాటకము కడు వీర రసప్రధానంబై

యొప్పుచున్నది. అయ్యది ప్రదర్శించినచో సభ్యుల హృదయంబులు దప్పక రంజిల్లఁగలవు.

సూత్ర—(ఆలోచించి) అవును. జ్ఞప్తికివచ్చినది. ఇయ్యది ద్రోణము రాజు సీతారామరాయకవివరునిచే నూతనముగా రచింపఁబడిన శ్రీరామచరిత్ర సంబంధమైన నాటకములలో నాల్గవయది. నీవు జెప్పన ట్లియ్యది ప్రదర్శించినచో సభ్యులు తప్పక యానందింపఁగల రు. (ఇంచుకయూరకుండి) అదియట్లుంచ, నీచరిత్రమందేత్రిలోక కంటకుండగు రావణుండు శ్రీరామునితోఁ బోరాడి, శాశ్వతా నంద పదంబున న్వస్థుఁడై యుండును.

(తెరలో)

అఁ పాపా! వృథామంగళపాఠకా!

శా॥ మాయంబన్ని కురంగరాజమునొగిన్ ♦ బంపించి మాయన్నయా
నాయిక్ష్వాకుని నన్యభూధవ కిరీటాంచత్కుటీర ప్రభా
శ్రీయుక్తాంచిత నూత్నదివ్యమణి రాజీరాజతాంఘ్రిన్ జగ
ద్గేయున్ వంచినజేసి యవ్వనితఁ దద్దేవిన్ ధరాపుత్రికన్
మాయంగొంచునుబోవు రావణుఁడిలన్ ♦ స్వస్థుండుగానుండునే.

సూత్ర—పారిపార్శ్వకా! నేనన్నమాటకు శ్రీరాముని తమ్ముండగు లక్ష్మణుండువేరుగ నర్థముజేసికొని క్రోధావేశంబున సుగ్రీవునితో నిట్లువచ్చుచున్నాఁడు. ఇంకమనమిచటనుండరాదు రమ్ము. (ఇరువు రును నిష్క్రమింతురు)

ఇదిప్రస్తావన.



# శ్రీ రా మ వి జ య ము.

## ప్ర థ మా ం క ము.

[తరువాత క్రోధావేశముతో లక్ష్మణుండును సుగ్రీవుండును ప్రవేశము.]

లక్ష్మ—(క్రోధముతో) ఆ! పాపా! వృథామంగళపాఠకా!

శా. మాయంబన్ని కురంగరాజమునొగిన్ ♦ బంపించి మాయన్నయా
నాయిక్ష్వాకుని నన్యభూధవకిరీ ♦ టాంచత్కటీరప్రభా
శ్రీయుక్తాంచితనూత్న దివ్యమణి రా♦జీరాజతాంఘ్రున్ జగ
ద్గేయున్ వంచనజేసి యవ్వనితఁ ద♦ద్దేవిన్ ధరాపుత్రికన్
మాయంగొంచునుబోవు రావణుఁ డిలన్ ♦ స్వస్థుండుగానుండునే.

సుగ్రీ—లక్ష్మణా! శాంతింపుము. ఆభరతపుత్రుని వాక్యంబు మనకు సంతోషదాయకంబై యున్నదికదా,

లక్ష్మ—(నిందాగర్భముగా) చాలుఁజాలు. రావణుండు నీసోదరుండని యా యిట్లుపలుకుచుంటివి. ఆకారణంబున నేకాఁబోలు నాతనితో సంధిసేయుటకు నీవునునిష్టపడితివి.

సుగ్రీ—(కోపముతో) అయ్యో!

తే. గీ. లోకకంటకుండగుచును ♦ ఝ్మాకళత్రు
భార్యను నపహారించిన ♦ పాపరతుఁడు
సంధిసేయంగఁదగువాఁడె ♦ జానకీశుఁ
డిచ్ఛగింపకయుండిన ♦ నెంతయేని.

విభీషణవచనానుసారియై యంగదుని రావణునికడకు రాయబారిగాఁబంపెను. కానిదైత్యుండు సంధికిచ్చగింపఁడు. మనకు రణముతప్పదు.

లక్ష్మ—(రోషముతో) నీవట్లేచెప్పుచుందువు. ఆదైత్యుండు రణంబున కిచ్చగించనిచో మనమూరకొనవలసినదేనా! ఏమైనను మీతోఁగలియక నేనువేరుగఁ గయ్యంబొనరించి దానవానీకంబు భస్మంబుగావించెద.

ఉ. గంధగజేంద్రగామినిని ♦ గైకొనిపోవు దశాస్యుతోడనా
సంధిఘటింపగాఁదలఁచె ♦ జానకినాథుఁడు నేనుమాత్ర మా
సంధికినిచ్చగింప విల♦సద్భుజమేర్చి రణంబునందు గ
ర్వాంధుని రావణాసురుని ♦ బంధుసమేతముగాఁగఁ ద్రుంచెదన్.

మీరెవ్వరును యుద్ధంబొనర్పనక్కరలేదు. ఖరాసిమాత్రసహాయుండనై నేనే రణరంగంబులోని కుఱికెద.

సుగ్రీ—సౌమిత్రీ! నీవిట్లు ఘడియఘడియకును గోపస్వభావుండవగుచుండినచో శాంతమూర్తియగు మీయన్నగారు చింతింపరా.

లక్ష్మ—అన్నగారు చింతనుగూడ నెఱుంగుదురా!

మ. వనమందున్ బదునాల్గువత్సరములున్ ♦ వాసంబునుంజేసి ర
మ్మని కైకమ్మవచింప ధర్మమనుచున్ ♦ భావించి చింతింప కీ
యనఘుం డిట్లరుదెంచె రాజ్యరమ నా♦హా వీడి యిప్పట్ల రా
వణుఁడన్నన్ మదిజింతనొందునె కటా ♦ భావించివీక్షింపఁగన్.

ఇదంతయునాకేల. నీవీక్షణమందేగి మాయన్నగారితో సకలదానవ వధోద్దేశోగ్రహృదయుండగు లక్ష్మణుం డిట్లు విన్నవించెనని పలుకుము.

సుగ్రీ—ఎట్లు

లక్ష్మ—ఇదిగో చూచుము.

మ. భవదాజ్ఞన్ శిరమందుదాల్చి యెపుడున్ ♦ వర్తింపుచున్నాఁడ, న
య్యవివేకుండు దశాస్యుతోడ నిపుడా♦హా సంధికేనొప్ప ని
య్యవనిన్ దేవవిరోధులన్ దునిమి యు♦ద్యత్ప్రీతి ; నిన్గాంచెదన్
బవరంబందుఁ జరింతు నొక్కఁడనె నన్ ♦ బాలించి రక్షింపుమీ.

(అహంకారముతో నడచుచు) సుగ్రీవా ! నీవేగి యన్నగారివద్దర నుండుము. నేను ఖడ్గసహాయమాత్రుఁడనై రణభూమిం బ్రవేశించెద.

సుగ్రీ—దేవా ! నీవిప్పుడు రణభూమిం బ్రవేశించుటలేదు. అన్నగారి శిబిరసమీపంబునకే వచ్చితివి.

లక్ష్మ—అట్లనా (ఆలోచించి) కానిమ్ము. అన్నగారితోనే సంభాషించెద. (నేలఁజతికిలఁబడి) భానుపుత్రా ! అంగదునితో నేమనిచెప్పి రాయబారిగా రావణునికడకుఁ బంపినారు.

సుగ్రీ—

శా. "ఓరీ రావణ ! భీతిలేక వనిలో ♦ నుండంగ వంచించి సీ
తారామామణిఁ గొంచుఁబోతివి కదున్ ♦ ధైర్యంబునుంబూని, యా
ఘోరారణ్యమునందె యున్నయెడలన్ ♦ గోదండపాండిత్య మే
పారన్ నిన్ను వధింపకుండుదునె దై♦త్యశ్రేణి ఘోషింపఁగన్."

శా. దేవౌఘంబును బాధపెట్టినను న♦ర్థింజంపగానెంచి సు
గ్రీవుండున్ వెనువెంట రా వనచర♦శ్రేణీసమేతుండనై
నే విచ్చేసితి ; సీతనిచ్చి శరణున్ ♦ వేఁబొందు కాకున్నచో
జీవశ్రాద్ధముచేసికొంచు మరి నా♦జిక్షోణినింజొచ్చుమా.

తే. గీ. జానకీదేవి నిచ్చి నన్ ♦ శరణుబొందు
కాచిరక్షించువాఁడ నిన్ ♦ గరుణమీఱఁ
గాకయుండిననిన్ను సం♦గ్రామమందుఁ
జంపి మీవిభీషనుని రా♦జ్యంబునందు
నిలుపువాఁడనంచును మది ♦ దలఁపుమయ్య.

అని శ్రీరామునిపలుకులుగా రావణునితోఁ జెప్పుమని యంగదుని కాజ్ఞాపించిరి.

లక్ష్మ—ఒకవేళ వాఁడు మనకు జడిసి సీతను సమర్పించి రామచంద్రుని శరణుబొందిన-చో యూరకొనవలసినదేనా. అట్టి దేవవిరోధియు లోకకంటకుండునగు దశకంఠుఁ డీయవనిపై నుండవలసినదేనా! ఎప్పుడు రాముండు రావణుని దునుమాడెదనని ప్రతిజ్ఞ గావించెనో యప్పుడే యాదైత్యునితో సంధిజేయఁగూడదని నిశ్చయము జేసికొనబడినది. మింట దేవతలుగూడ రాముండు కపిసేనతో లంకఁ బ్రవేశించెననియు, లోకం బదానవంబగుననియు, సంతసింపుచుండిరి. ఇదియుంగాక మొన్న హనుమంతుచే సీతామహాదేవి "రావణుని బుత్రామాత్యభృత్యాదివర్గంబుతో నన్ను గొంపోవలెనని" సందేశము బంపుట నన్నగారు మఱచిపోయిరికాఁబోలు. (సీతనుద్దేశించి) తల్లీ! జానకీదేవీ! ఒకవేళ నీవు పంపిన సందేశంబును నన్నగారు మఱచిపోయినను నీపాదసేవకుండగు నీలక్ష్మణుండు మఱచిపోలేదు. జననీసమానా! నీకష్టమింక రోజులలో దీఱగలదు.

శా॥ ఘోరాకారులు కామరూపులగు రక్షోనాధయోధాళిపై
నారాచంబు లనేకముల్ బఱపి నానారీతులన్ బోరి, యా
క్రూరుండైన దశాస్యుదాఁకి యసురుల్ ఘోషింపగాఁ గూల్చి, సీ
తారామామణి నీదుచిత్తము ప్రమోదాంభోధిలోఁ దేల్చెదన్.

రాముఁడు ప్రవేశించుచున్నాఁడు

రాము—(తనలో) ఆహా! లక్ష్మణునకు నాయందును సీతయందును గల భక్తి వర్ణనాతీతముకదా. (ప్రకాశముగా) లక్ష్మణా! నీవన్న మాట యింకొకసారి వచింపుము.

లక్ష్మ—(ఆమాటవినకనే పైపద్యమును జదువుచున్నాఁడు)

రాము—లక్ష్మణుని జూచి) తమ్ముఁడా! లక్ష్మణా!

లక్ష్మ—(రామునిగనుంగొని) అన్నయ్యా! కోపావేశంబున నొడలెఱుంగక నీముఖకమలంబు వీక్షింపనైతిని. నీ విచ్చటికివచ్చి యెంతసేపయినది.

రాము—ఇప్పుడే వచ్చితిని. మీరిరువురు నిచ్చటనేయుంటిరా. ఆవాన వృందు పోరితంబునకు బలంబుల నాయితంబు సేయుచున్నాఁడఁట.

లక్ష్మ—పోరునుగూర్చి మీ కేమియుఁ దొందరలేదుకదా. మీరు రావణునితో సంధిజేసికొననెంచితిరికదా.

రాము—అంగదుని రాయబారిగఁబంపితిననియా నీకుఁ గోపమువచ్చినది. వాని మనం బెట్లుండునో కనుగొనుటకుఁ బంపితిని తమ్ముఁడా!

మ॥ వినుమా! సందియమేల నీకు సచివాన్వితున్ సురారిన్ రణం
బున నేఁగూల్తు; నభంబుకేగిన నధోభూమిం జొరంబారినన్
వనజాతాసనుఁడడ్డమై నిలిచినన్ బాణంబుతో పీడ నో
యనుజా! నమ్ముము నాదుపల్కులను నుద్యత్స్థైర్యమేపారఁగన్.

లక్ష్మ—నాకదియే కావలసినది.

రాము—తమ్ముఁడా! ఆరావణుఁడు గడు మాయాపరతంత్రుఁడసుమా! వాఁడు విద్యుజ్జిహ్వుఁడను రక్కసునిచే నాశిరస్సును జాపంబును గల్పింపఁజేసి, యయ్యది సీతకడకుం గొంపోయి నేను మరణించితినని చెప్పెను.

లక్ష్మ—పాపము శమించునుగాక. వాఁడట్లుజేయ సీతామహాదేవి నమ్మి యెట్టి దారుణకృత్యంబును జేయలేదుకదా!

రాము—లేదు. లేదు. ఆమె మరణోద్యుక్తయైయుండఁ బవిత్రచరిత్రయగు సరమయను రాక్షసకాంత యదియంతయు మిథ్యయని యామెకు ధైర్యంబుజెప్పి యూరడించెనఁట.

లక్ష్మ—ఇది మనకెట్లు తెలిసినది.

రాము—విభీషణుని మంత్రులలో నొకఁడు గూఢరూపియై యిదియంతయుఁ గాంచివచ్చె. దానవబలంబులు మనపైకి దాడివెడలి వచ్చుచున్నవఁట.

లక్ష్మ—అన్నన్నా! దానవుం డెట్టిమాయబన్నెను. (కోపముతో రావణునుద్దేశించి) ఓరోరీ! రావణా! నీవు రామలక్ష్మణ క్రోధానలంబునఁ బడి మ్రగ్గుసమయ మాసన్నమైనది. (సుగ్రీవునిజూచి) ఇంక నాలోచింపనక్కరలేదు.

శా॥ నీ వీతక్షణమందు నంగదు నలున్ ♦ నీలున్ బలంబెల్ల, సు
గ్రీవా! సిద్ధముజేసిరమ్ము మిఁకఁ బం♦క్తిగ్రీవసైన్యంబు నే
నీవేళన్ వధియింతు మద్బలముచే ♦ నింతైన శంకింపకన్
దేవారాతి దశాననుండు మది భీ♦తింజెంది శోషిల్లగన్.

రాము—అనేకసారులు మాల్యవంతుఁడు సీతనిచ్చి శరణుబొందవలసినదని చెప్పగా నిరాకరించిన దశాస్యుఁడు సంధి కిచ్చగించునని తోఁచదు. అదియుంగాక దానవబలంబులు కపులం దాఁకవచ్చుచున్నవఁట. నీవేగి బలంబుల సిద్ధముజేసి రమ్ము.

సుగ్రీ—చిత్తము. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) సమస్తబలంబులును సిద్ధమయ్యేయున్నవి.

లక్ష్మ—అన్నయ్యా! తొలుదొల్త దానవసైన్యంబుల దాఁకుటకు నన్నుఁ బోనిమ్ము. నీ వనవసరముగుశ్రమ నొందకుము. పంక్తిగ్రీవవధోద్యోగంబునుమాత్రము పూనియుండుము.

—తొందరగాఁ గంచుకి ప్రవేశించును—

కంచు—మహారాజా! అంగదుఁడు. అంగదుఁడు.

రాము—ఏడీ! ఏడీ! అంగదుఁడు.

కంచు—నిఖిలలోకకంటకుఁడగు దశకంఠునిచే బద్ధుఁడుగాఁబోయెను.

లక్ష్మ—ఏమీ! అంగదుని రావణుఁడు బంధించెనా!

కంచు—లేదు. లేదు. తత్ప్రయత్నంబు జరగినది.

లక్ష్మ—అప్పు డంగదుం డేమిచేసెను.

కంచు—అప్పు డంగదుండు రోషావేశపరవశుండై దర్పంబుబేర్చి తనక ష్టుపడిన దైత్యులఁ జావమోఁది కసురయుంబున వచ్చెను. మేఘనాథాధిపత్యంబున రాక్షసబలంబువచ్చి మనసేనందాఁకినది. అంగదుం డింద్రజిత్తుతోఁ బోరుచున్నాఁడు.

సుగ్రీ—సాక్షాద్విష్ణుస్వరూపుండగు శ్రీరాముని చేఁ బంపఁబడిన దూత యని యైనను భావింపక బంధింపఁదలఁచెగా!

లక్ష్మ—మిత్రమా! ఆదురాత్ముండు కేవలము క్రూరుండును మూఢుండును గదా!

మ॥ మునులుఙ్ జ్ఞానులు సాధుమార్గచరు లే ♦ పుణ్యాత్ముఁ జిత్తంబునన్
వినుతించేయుచు నుందు రెప్పుడును నే ♦ విశ్వేశుపాదంబు సోఁ
కినమాత్రంబున నాతిఁయయ్యె శిల ; యా ♦ కీర్తిప్రదుండైన రా
మునిమాహాత్మ్యమెఱుంగ శక్తుఁడగునే♦ మూఢుండు దైత్యుండిలన్.

రాము—లక్ష్మణా! ఇంక నేనును సుగ్రీవుండును సమరసన్నాహం బాచరించి వైరులను దాఁకెదము. నీవును సత్వరమ్మురమ్ము.

(సుగ్రీవుఁడు, రాముఁడు నిష్క్రమించుచున్నారు)

(తెరలోపలఁ గలకలానంతరము)

ఓహో! నీలజాంబవదాంగదసుషేణాదిమహాసేనాధిపతులారా! మీరందఱును నాలకింపుఁడు.

మ. ఖరు నారాచపరంపరన్ హతునిగాఁ ♦ గావించె, నాదూషణున్
ధరణిన్ గూల్చెఁ, గబంధునిందునిమె, నా♦దైత్యున్ విరాధున్ మహో

ద్ధురుతఁ జావఁగఁజేసె రాముని మహోత్రాగ్ని యిప్పుడు భూ
భరముఁ దీర్పదలంచి దైత్యకులవిధ్వంసంబుగావించెనుఁ.

లక్ష్మ—(ఆలకించి సంతోషముతో) కావించుఁగాక కావించుఁగాక.

(మరలఁ దెరలోపలఁ గలకలము)

కంచు—దేవా! మేఘనిస్వనంబును మించిన రణదుందుభి ఘుడియఘుడి
యకును మ్రోగుచున్నది. ఇందుకుఁ గారణమేమి!

లక్ష్మ—యజ్ఞము జరగుచున్నది.

కంచు—దేవా! ఏమియజ్ఞము.

లక్ష్మ—మరేమియు లేదు. రణయజ్ఞము.

మ॥ విను సుగ్రీవుఁడు నేను సంగదమహా వీరుండు నీలుండునుఁ
ఘనబుత్విక్కులుగాఁగ; నెంచఁగను హనుమంతుం డుపద్రష్టగా
ననుజుండాజిగ సోమిదమ్మగను సీతాదేవియుఁ; దత్పశుల్
జనహింసాపరులైన దైత్యులుగ యజ్ఞంబొను నిప్పట్టునఁ.

కంచు—అట్లయినచో నీవు కయ్యంబునకుఁ బోనక్కరలేదా!

లక్ష్మ—ఇదిగో నేగుచుంటిని.

కంచు—కుమారా! నీకు జయమగుఁగాక. పెద్దవాఁడనుగాన జెప్పుచుం
టిని. జాగరూకుండవై రణరంగమున మెలంగఁగోరెద.

లక్ష్మ—నీవేమియు భీతిల్లనవసరములేదు రమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రథమాంకము.

---



# శ్రీ రా మ వి జ య ము.

## ద్వితీయాంకము.

[ఉద్యానవనము—ప్రవేశము, వజ్రకంఠుఁడు]

వజ్ర—(స్వగతము) అబ్బబ్బా! ఈయుద్ధంబంతయు నాప్రాణంబులు బోవుటకు వచ్చినదిగాని మరియొకటికాదు. అంతఃపురసేవ యతికష్టముకదా. ఈదానవేంద్రుని కంటఁబడినఁ జాలును. ఏదియో యొక పని గల్పింపకమానఁడు. ముదుసలినన్నైనను గృపవహింపఁడు. కపిసేనాసమేతుఁడై శ్రీరామలక్ష్మణు లెత్తివచ్చి లంకను ముట్టడించి ఘోరంబుగఁ బోరుచుండ నీతని కాలక్ష్యమే లేక నంతఃపురంబునఁ గాంతలతో విహరింపుచుండె. ఆలోచించి చూడఁగా నీతనిసంగతి యేమియు బాగులేదు. ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులఁ గావించె నని సంతసించెనుగాని తిరిగి పాశవిముక్తులై వారు సమరోన్ముఖులైరని వినలేదుకాఁబోలు. అన్నా! మారాక్షసబలంబులయం దిప్పటికే ధూమ్రాక్షుఁడు నకంపనుఁడు, వజ్రదంష్ట్రుఁడు మొదలగు వీరులు మడిసిరి. దీనింగాంచి దైత్యులందఱును భీతిజెంది రావణునితో మొఱ్ఱవెట్టుకొనఁగాఁ బ్రహస్తుని గయ్యంబుసేయఁబంపెనఁట. ఈతఁడైనను బరాక్రమంబున విజృంభించి మాకుఁ గొంతయాధారము గలుగఁజేయఁడా! (ఇంచుకయూరకొని) అన్నా! రాక్షసేంద్రునియాజ్ఞ మఱచిపోయితిని. మందోదరీదేవిగారిప్పు డెచ్చటనున్నారో చూచిరమ్మని యాజ్ఞాపించెనుగదా. (ప్రక్కంజూచి) అదిగో!

ఏకజట యీదారిం బోవుచున్నది. దానిం గనుంగొనెదఁగాక. (ప్రకాశముగా) ఏకజటా! ఏకజట! ఇప్పుడు మందోదరీదేవిగా రెచ్చటనున్నారో నీకుఁ దెలియునా!

(తెరలో)

మందోదరీదేవిగారిప్పుడే యంతఃపురోద్యానవనంబులోనికిఁ జెలికత్తెయగు నర్మదతోఁ బ్రవేశించినారు.

వజ్ర—అట్లనా. ఈవార్త నేనింక రావణున కెఱింగించెద.

(నిష్క్రమించుచున్నాఁడు)

[తరువాత మందోదరి, నర్మద ప్రవేశించుచున్నారు]

నర్మ—దేవీ! చిత్తంబును బదిలపఱచుకొని యాకల తెఱం గెఱింగింపుము.

మందో—ఆకలగాంచినప్పటికే భయభ్రాంతాత్మనై దాని తెఱం గంతయు మఱచిపోయితిని. నెమ్మదిగ జ్ఞాపకము జేసికొని చెప్పెద. ఇంచుక సేపు తాళుము.

[అంత రావణుఁడు, వజ్రకంఠుఁడును, బ్రవేశించుచున్నారు]

రావ—వజ్రకంఠా! రాముఁడేమన్నాఁడు!

ఉ॥ ఏమఱుపాటునుండగను ♦ నిందజి సద్బలదర్పమేర్చి, మ
మ్మామహి పాశబద్ధులుగ ♦ నెంతయుఁ జేసెను మాయచేత, సం
గ్రామమునందు మాయెదుటఁ ♦ గన్పడుచున్ దనరారు నేని యీ
భూమికి నీయనే బలిని ♦ భూరిపరాక్రమవిక్రమంబునన్.

అనియూ వక్కాణించెను. చేతికిఁ జిక్కినప్పు డట్లుగాక మఱేమని చెప్పుకొనును. ఇంతకును వారు బంధవిముక్తులైరిగావున నేమన్నను బ్రయోజనము లేదు.

తే. గీ. భుజబలపరాక్రమము బేర్చి ♦ భూరిశస్త్ర
సమితివర్షంబుగురిపించి ♦ సైన్యసంయు
తంబుగ ; వధించు, సురులు సం♦తసము నొంద
రణమునందున రావణు ♦ రాఘవుండు.

వజ్ర—(చెవులుమూసికొని) అమంగళము శమించుఁగాక.

రావ—అట్లందువేమి. నేనిప్పుడేమంటిని.

వజ్ర—తే. గీ. భుజ———(అనుపైపద్యంబును జదువుచున్నాఁడు)

రావ—నామనంబంతయు మందోదరిపైఁ జిక్కియుండుటచేఁ బొరబడి యట్లంటి (ఇంచుకయూరకుండి) వజ్రకంఠా ! చూడుము.

తే॥ గీ॥ మందవాయువుపీచె నా ♦ నందముగను
జిత్తమానందవార్ధి రం♦జిల్లుచుండె
వెలఁదితోఁగూడి యొక్కింత ♦ విశ్రమించి
సంగరాంగణంబును జొత్తు ♦ సత్వరముగ.

నీవేగి రథంబుసిద్ధముసేయుమని సారథితోఁ జెప్పుము.

వజ్ర—చిత్తము (నిష్క్రమించుచున్నాఁడు)

రావ—(ఇంచుకనడచి) అదిగో ! మన్మనోహారి నర్మదతో నేదియో సంభాషించుచు నచ్చటనున్నది. రామునితో సంధిజేసికొమ్మని చెప్పిన యీమెవాక్యంబులను వినకుండుటచే నేమైనగోపము వచ్చిన దేమో.

నర్మ—దేవీ ! కలసంగతి జ్ఞప్తికివచ్చినదా.

మందో—ఆ ! జ్ఞప్తికివచ్చినది. సంతాపముమాత్రముపోలేదు చిత్తంబున నేదియో భయముపుట్టుచున్నది. ఇదిగో చెప్పెదవినుము. రాత్రి కలయందు నాకొక భూసురుండు గనుపట్టి రాముండు విష్ణుమూర్తియనియు, సీత లక్ష్మియనియుఁ, జెప్పి వారి మహిమంబులను, నవ

తారంబులను, వర్ణించి రావణసంహారార్థమై రాముండు జనించెనని చెప్పెను.

వర్మ—ఇవినిజముగాఁ బాతుకలయే. అయినను దశాంతికై గౌరీపూజ నాచరింపుము.

మందో—రామునితోఁ గయ్యంబువలదని చెప్పినను నాపలుకులువినఁడయ్యె. ఏమిచెప్పుదును. ఆసమయంబున నేనొకవానరునిచేఁ దలఁబట్టుకొని యీడ్వఁబడితిని.

రావ—(కోపముతో తొందరగాఁబ్రవేశించి)

ఉ॥ చెప్పుము చెప్పు మెవ్వఁడిటు ♦ జిత్తమునందు భయమింత లేక నీ
కొప్పునుబట్టియీడ్వఁ గలుగుఁ ♦ దశకంఠుఁడు భూమినుండగా
నిప్పుడె వానిఁజంపెద న♦హీనపరాక్రమమేర్పడంగ, నో
యొప్పులకుప్ప సందియము ♦ నొందకు డెందమునందుసుందరీ.

మ॥ వరబాహాబలవిక్రమంబున సుప♦ర్వశ్రేణిదండించి, కి
న్నరగంధర్వుల సంగరాంగణములన్ ♦ దర్పంబునందోలి, సు
స్థిరకీర్తిన్ విహరింతు నట్టియెడ భీ♦తింబూనకెవ్వాఁడు, నిన్
దరుణీ! గాసిలఁజేసెఁ జెప్పుమిఁక నే♦ధండింతు నాసీచునిన్.

మందో—(రావణునిజూచి) మనోహరా! శాంతింపుము. మీరు సన్నిహితులై యుండ నాశిరోజంబులుబట్ట నెవ్వఁడుసాహసించును. కలసంగతి జెలిక త్తెకుఁజెప్పుచుండ మీరు వేరుగ నభిప్రాయపడిరి.

రావ—ఏమీ! అదికలయా! రమణీ! నిజంబని తలంచితినిసుమా!

మందో—నాచిత్తంబున మిగులభయంబుజనించినది. నావిన్నపమాలించి యీజానకిని రామునకిచ్చి యాతనితో సంధిజేసికొని సుఖంబుగ నుండుడు.

రావ—దేవీ! చాలునీభయము.

మ॥ తనయ శ్రేష్ఠుని మేఘనాథుని మహాదర్పంబు నూహింపవా
యనుజుండుండెను గుంభకర్ణుఁడు సముద్యత్క్రోధముంబేర్చి యా
జిని నిల్వంబడెనేని బెక్కురిపుల న్జెండాడగాఁజాలఁడే
విను నాబాహుపరాక్రమం బెఱుగవా భీతిల్లగానేటికిన్.

శా॥ నీ వీక్షింతువుగాక సంగరమున న్శ్రీరాము; సౌమిత్రి; సు
గ్రీవున్ వాలిజు నీలుని న్హనుమని న్గీలింతు నెవ్వానిని న్
భావింపంగనె శత్రుబృందము భయ భ్రాంతాత్ముమైయుండు నా
దేవారాతిని నన్ రిపుల్ గెలుతురే దీవ్యద్బలంబొప్పగన్.

మందో—దేవా! మీకు నేనుజెప్పవలసినదానిని గానుగాని, సాహసిం
చిచెప్పుచుంటిని. రాత్రి కలఁగన్నదిమొదలు చిత్తంబంతయు వికల
తజెందియున్నది.

రావ—(నవ్వుచు) రాత్రి కలగని నీవుభయపడుచుంటివా! అభయమిప్ప
టికిని బోలేదుగా!

తే. గీ. వనమున న్విహరించుచు బాము గాంచి
మందిరమునఁ ద్రాడునుగని పామటంచు
భయముగాంచెడి పిఱికియా మానిసివలెఁ
గలఁగాంచి సతీమణుల్ గనుభయంబు
బడుచునుందురు జాగ్రతా వస్థయందు.

మందో—స్త్రీచిత్తం బతిధైర్యహీనమగుటంజేసి పలుకుచుంటిని నన్ను
మన్నింపుము. ఆరాముండు పరాక్రమవంతుండనియు ధరాభారంబు
వాపనెంచి మర్త్యాకృతిని గైకొన్న విష్ణుమూర్తియేయనియు వినియుం
టి. వానరుండొక్కరుఁడు సముద్రము లంఘించి మనపురంబున కిట్టి
కీడుసేయుననని మనము కలనైనను దలంచియుంటిమా! నన్నుఁ బా
లించు నాథుండవుగావున నింతగా నొక్కి వక్కాణింపుచున్నదాన.

ఆసీతను రామునకిచ్చి సుఖంబుగ రాజ్యంబు పాలింపుఁడు. దోర్బల విరాజితుండగు రాముని సంగ్రామరంగంబున గెల్చుట కారుద్రని కైనను దరంబుగాదని వినియుంటి. కావున నాపలుకులాలించి రాముని శరణుబొంది సుఖింపుఁడు.

రావ—(క్రోధముతో)

శా. ఔరా! ఎంతటిమాటలాడితివి యోహో! నేను మర్త్యుండునౌ
శ్రీరామున్ శరణంబుబొందెదనె ఛీ ♦ ఛీ నోరుమూయుమీ
ఘోరాజిన్ వధియింతు నాయధము దక్షోధీశు దేవేరివై
యీరీతిన్ వచియింప నీకుఁదగునే ♦ యెంతైనఁజింతింపకన్.

భర్త భుజబలపరాక్రమంబు దెలియని బేలా!

తే॥ గీ॥ వీరపత్నివి యనిపిలి♦పించుకొనెడి
భాగ్యము లభించెఁగాని యో ♦ పడఁతిమిన్న
వీరమాతవు నని పిలి♦పించుకొనెడి
భాగ్యమబ్బదయ్యెను ధాత ♦ వ్రాఁతకతన.

మందో—దేవా! మీపరాక్రమం బెఱుంగకపోలేదు. ఆమదాననగు లచే భయభ్రాంతనై యట్లు పలికితి. దేవరవారి యిచ్ఛవచ్చినట్లు గావింపుఁడు. మీకు జయంబు గలుగుటకై నిరంతరంబును సప్పర మేశ్వరుని బ్రార్థింపుచుందు.

రావ—ఇప్పుడుగదా నీవు ధన్యవైతివి.

వజ్రకంఠుఁడు—(ప్రవేశించి) దేవా! మంత్రియగు ప్రహస్తునితల్లి మైత్రేయి దేవరదర్శనార్థమై వేచియున్నది.

రావ—ఏమి! ప్రహస్తునితల్లియా! ఎందులకేతెంచెనోకదా! కనుఁగొందము. శీఘ్రంబుగఁ దీసికొనిరమ్ము.

వజ్ర—చిత్తము. (అని నిష్క్రమించి మైత్రేయితోఁ బ్రవేశించుచున్నాఁడు)

రావ—మైత్రియీ! రణరంగంబుననున్న ప్రహస్తుండు కుశలమేకదా!

మైత్రి—నాయినా! ఏమికుశలము. ఆతండు నీయాజ్ఞంగొని సంగ్రామముసేయ నేగి, భుజబలపరాక్రమంబున విజృంభించి వైరిసేనలను రూపుమాపుచుండ నతని దాఁకువా రెవ్వరును లేక పారదొడంగిరఁట. అప్పుడు నీలుండను కపివరుండు దర్పంబుబేర్చి యీతనిఁదాఁకి నేఁటిదినంబునఁ బ్రహస్తుని దప్పక వధించెదనని ప్రతిజ్ఞ జేసినాఁడఁట. శ్రీరామలక్ష్మణ భుజబలపరిరక్షితుండై నీలుండు ఘోరంబుగఁ బోరుసల్పుచుండె. ఈవార్త విన నాకేమియుఁ దోఁచక నీకడకుఁ బరుగెత్తుకొనివచ్చితి. నాయినా! రక్షింపుము.

రావ—సుతునిపరాక్రమంబు దెలియని యోమైత్రియీ!

తే॥ గీ॥ ఆప్రహస్తుండు శరమూని ♦ యాజియందు
నిలువఁబడెనేని శాత్రవుల్ ♦ నిలువఁగలరె
యక్షగంధర్వులనుబట్టి ♦ యడఁచె పీచ
మట్టిసుతునికై భీతిల్ల ♦ నగునెనీకు.

చ॥ వినుము రిపుల్ భయంపడఁగ ♦ బృథ్వినినెల్ల నవానరంబుగాఁ
దనభుజశౌర్యమేర్పడఁగ ♦ దప్పకచేయును భీతియేల, రా
వణపరిరక్షితుండగు భవత్సుతునింగన శక్యమానె యా
జిని రిపుశీర్షముల్ కరము ♦ చెండులభాతిని నాటలాడఁడే.

అస్మద్భుజబలసంరక్షితుండగు నీసుతుంగూర్చి యావంతయు స్వాంతంబునఁ జింతింపకుము. నేనిప్పుడే భండనభూమికేగి పరాక్రమంబేర్చి రామలక్ష్మణసమేతంబుగాఁ గపిసేనలను మదస్త్రజ్వాలల కాహుతిజేసివచ్చెద. (వజ్రకంఠునిజూచి) ఓరీ! నీవు శీఘ్రంబుగనేగి సకలసాధనసంయుతంబుగఁ బోరితంబునకుఁ దేరాయితంబుసేయుమని సారథికిందెల్పుము.

వజ్రి—చిత్తము. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) దేవా! సంగరంబున కేగుటకు రథం బిదివఱకే సిద్ధమైయున్నది.

రావ—(మందోదరిపైజూచి) దేవీ! నేనింక సమరంబున కేగి వచ్చెదను. నీవంతఃపురంబునకుఁ బొమ్ము.

మందో—నాథా! రిపుబలంబులయం దప్రమత్తతోఁ జరింపుఁడని ప్రార్థింపుచున్నాను. మీకు జయమగుఁగాక.

రావ—కాంతామణీ! నీవందుకు సందియంబందకుము.

మాలిని.

ఘోరరణంబును సేయుచునుండి యకుంఠితవైరుల దాఁకుచు న
వ్వారు ప్రయోగము సేయుశరంబుల వారక త్రిప్పుచుఁ గూల్చుచు నిం
పారఁగ రక్తమునందునఁ దానము నాడుచు భూరిపరితాపముతో
వీరవిహారముసల్పఁగ రావణ వీరున కే తగు నమ్మసతీ.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.







# శ్రీరామవిజయము.

## తృతీయాంకము.

[ప్రవేశము రావణుని సుపార్శ్వుఁడు చేయిఁబట్టుకొని తీసికొనివచ్చును]

సుపా—

ఉ॥ నేరమొకింతలేని రమ♦ణీమణి శ్రీరఘురామచంద్రుదే
వేరి ధరాత్మజాత నవి♦వేకుఁడవై వధియించి పాపముల్
ధారుణియందుఁగట్టికొన ♦ ధర్మమటంచును నీకుఁదోఁచెనే
యోరజనీచరాన్వయ మ♦హోదధిచంద్ర కృపన్ వహింపుమా.

రావ—ఓయీ! సుపార్శ్వ! నీకుఁదెలియ దూరకొనుము.

ఉ॥ దీనికతంబునంగద యు♦దీర్ణబలాఢ్యుల దైత్యవీరులన్
బూని వధించెఁగాదె రఘు♦పుంగవుఁ డుగ్రరణంబునందు ; నీ
మానినిఁజంపినన్ వినుము ♦ మాని రణంబును వేగమే యయో
ధ్యానగరంబుజేరెదరు ♦ దాశరథుల్ కడుఁజింతనొందుచున్.

మనకాయుద్ధము దప్పును.

సుపా—ఆహా! నీవెట్లుతలంచితివి.

తే॥ గీ॥ దానవుల్చచ్చిరనుచుఁ జి♦త్తంబునందుఁ
జింతనొందెడివాఁడవు ♦ సీతనేల
యపహరించుకదెచ్చితి ♦ వాజిమాన

బుద్ధిగల్గియెయున్న పూఁ•బోఁడి నేల
చంప ; నీమెను శ్రీరామ•చంద్రుకొసఁగి
శరణుబొందుచు మనరాదె • క్ష్మాతలమున.

తే॥ గీ॥ బ్రహ్మవంశంబునందు జ•న్మంబుగాంచి
వేదములనెల్లఁజదివి కు•బేరునకును
దమ్ముఁడవునై తపముజేసి • తరుణినిట్లు
జంపనెంచుట తగునొకో • సాహసమున.

కోపం బెట్టిపాపంబునకైనఁ బాల్పడఁజేయును. ఇంక నీవిట్టిపాపోద్యోగంబును జేయఁదలంపకుము.

ఉ॥ శూరులమైన మమ్ముగొని • చొచ్చుము వే రణరంగమందు, నా
శ్రీరఘురామలక్ష్మణులఁ • జెంతుము సైన్యయుతంబుగాఁగ ; సీ
తారమణీమణింగొనుము • దర్పముఁగల్గినవాఁడవేని, యీ
తీరున సీతఁజంపఁగ మ•దిన్ దలపోయకు రాక్షసేశ్వరా.

రావ—సుపార్శ్వ! నీవుచెప్పినవాక్యంబులు సమ్మతంబులై యున్నవి. కోపావేశంబున నొడలుదెలియక నట్లుబలికితిని. అప్రహస్తుండు నీలునిచే మడిసెనని చింతతోఁగూడినరౌద్రం బావహించినది.

ఉ॥ ఆలవిధానదేవతల • నందఱిదర్పము బేర్చి యార్చుచున్
దోలెను మందమందలుగఁ • దోయజగర్భునినైన గెల్వఁగా
జాలిన మేటి విక్రముఁడు • సాహసు నట్టిప్రహస్తుఁ జంపఁగాఁ
జాలెను నొక్క కోతియని • స్వాంతమునం గనుఁజింతనొందెదన్.

కానిమ్ము. చింతించుటవలనఁబ్రయోజనంబేమి ?

మ॥ బలవద్దివ్యపరాక్రమంబునను బ్ర•హ్మాండంబునొక్కమ్మడిన్
దలక్రిందౌనటుచేయఁగాఁగలను ను•ద్యద్ఘోరశస్త్రాంబుధిన్
గలనన్ వైరులముంచెదన్ విజయమున్ •గాంచన్ గనున్ మాయదా
రులఁ బన్నంగల నెన్నియైన రఘుధీ•రున్ దున్మెదెంతో భువిన్.

(తెరలో)

శా॥ నిద్రాసక్తి నినున్న నన్ను నిటులన్ ♦ లేపం బనేమోకదా
భద్రాత్ముండగు నాదు సోదరుఁడు క్షే♦మంబే కదా చెప్పుఁడీ
క్షుద్రుల్ వైరులు లంకనిప్పుడుగడున్ ♦ క్షోభిల్లగాఁ జేయఁ గో
పోద్రేకంబున నెత్తి రారు కద మీ♦రూహించి వేఁ జెప్పుఁడీ.

సుపా—అదుగో! దేవరవారి సోదరుండగు కుంభకర్ణుండు నిద్రమేల్కని తమదర్శనార్థమై యిటు వచ్చుచున్నాఁడు. అతని వెంట మహోదరుండు గూడఁ జనుదెంచుచున్నాఁడు.

కుంభ—(అంత పై పద్యమును జదువుచుఁ గుంభకర్ణుఁడును, నతనిననుసరించి మహోదరుండును బ్రవేశింతురు)

రావ—(తమ్ముని గాఁగిలించుకొని) మదాజ్ఞానువర్తివై నిద్రమేల్కని వచ్చితివా?

శా॥ రమ్మా నాయన! కుంభకర్ణ! ఘనని♦ద్రన్ మున్గియున్నట్టి నీ
కిమ్మాడ్కిన్ శ్రమగల్గజేసితని నీ ♦ వెంతైన నిప్పట్లఁ జి
త్తమ్మందున్ గనబోకుసందియము దై♦త్యశ్రేణినిన్ నన్ను నీ
వెమ్మార్గంబునఁ బ్రోచెదో యిఁకను నీ♦దే భార మోతమ్ముఁడా.

కుంభ—

శా॥ అన్నా సోదరవత్సలా! యిపుడు నా ♦ కాద్యంతమున్ దెల్పుమీ
నన్నున్నిద్రను లేపనేఁటికిటులన్ ♦ నాయందు సత్ప్రేమచేఁ
గ్రన్నన్ బిల్వఁగఁ జేసితేల; రిపు లు♦గ్రక్రోధమున్ బూనుచున్
నిన్నున్ దాఁకగ వచ్చినారె కరుణన్ ♦ వే జెప్పు చెండాడెదన్.

రావ—

మ॥ అనుజా యేమివచింతు నీకిపుడు ని♦ద్రాసక్తిలో నుంటచేఁ
గనలేవైతివి; రాముఁడన్ నరుఁడు శా♦ఖాజంతుసంఘమ్ముతో

వనరాశిఁ దరియించి నాపయికి ద♦ర్పంబేర్చి యేతెంచి, నే
నను నాశంబును జేసె నేనునుదు♦న న్నా! వేగఁ బాలింపవే.

తే॥ గీ॥ సమరభూమికి నేగు రా♦కుసులెకాని
మరల వచ్చువారలు లేరు ♦ మర్కటాళి
హస్తములఁదుందుఁ గూలుచు ♦ యమునిపురికిఁ
జనెడివారలెకాని యో ♦ యనుజయిపుడు.

ఉ॥ వారలఁ జంపువాఁడవని ♦ భావమునందలపోసి నిన్ను నున్
వారక నిద్రలేపితి భ♦వద్బలమేను నెఱుంగు దట్టిచో
ఘోరరణంబుసేయుచు న♦కుంఠిత శౌర్యముచేత వైరులన్
ధారుణియందునన్ దునిమి ♦ దైత్యులనేలుము నాకునై కృపన్.

సుపా—(ప్రక్కం జూచి) అదుగో మాల్యవంతుం డరుదెంచు చున్నాఁడు.

[మాల్యవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కుంభ—అన్నయ్యా! మున్ను నీవు సీతం దెచ్చినప్పుడు కార్యాలోచన జేయు సమయంబున నట్టి విపత్తు మూడునని తలంచితిమో యదియే ప్రాప్తించెను. ఇందు విపరీతం బేమియు లేదు. నీవుచేసిన యాదురితంబునకు ఫలం బిప్పు డనుభవింపనయ్యె. తొలుత నీవు సీతను నపహరించుకొనుటకుఁ బోవునప్పు డెవ్వరితోడను యోజించలేదు. శౌర్యమదంబుచే ముందువచ్చు నాపదలఁ దలంచవైతివి. ధర్మార్థకామంబులను సర్వవేళల భజించువానిని లక్ష్మి వరించియుండును. నిరంతరంబును గామంబునే కొనియాడువాఁడు పురుషుండే కాడు. సిరి వానినొల్లదు. మంత్రులతోడ నిది కార్య మిదియకార్యమని యోచించి హితంబగుదానిని ననుసరించినవాఁడు సౌఖ్యజీవియై యుండును. కొందఱు మంత్రులు రాజునకుఁ గీడుదలంచువారుందురు.

కావున నెన్నిగతుల నాలోచించిచూచినను విభీషణుండు చెప్పిన మార్గంబే చక్కగనున్నది. అప్రకారమాచరించుట శ్రేయస్సని చెప్ప సాహసించితిని.

మాల్య—(కుంభకర్ణునిజూచి) కుంభకర్ణా! చక్కనివాక్యంబులు బలికితివి. సీతను రామునకిమ్మని మీయన్న కెన్నెన్నిసారులో యిప్పటి వఱకును నొక్కి వక్కాణింపుచునేయుంటి.

మహో—ఓహో! మాల్యవంతా! పిలువని పేరంటంబునకు నిన్నెవ్వరు రమ్మనిరి. ఈరాక్షసేంద్రుఁడు కుంభకర్ణునికిఁ గయ్యంబునకుఁ జెప్పనందుల కతండేమియో పల్కుచుండెను. ఈనడుమ నిన్నెవ్వరైనను నాలోచనకోరిరా!

మాల్య—ఓరీ! దురాత్మా! పిలువని పేరంటమని నన్ను నిందించెదవా!

ఉ॥ నీవలె నోదురాత్మ యవినీతులు బల్కెడి మంత్రులుంటచే
భావిఫలం బెఱుంగకను ♦ భూమిపతి రాముని దేవియైన సీ
తావనితన్ హరించెనిటు ♦ దానవనాథుఁడు గాక యుండినన్
రావణుపైకివచ్చునొకొ ♦ రాముఁడు వానరసైన్యయుక్తుఁడై.

నీచమతీ! మహోదరా! నీవు నన్నాక్షేపించఁగలవు గాని రాముని బారినుండి తప్పించుకొని వచ్చిన యొక్క దానవుని పేరు చెప్పుము. మీమీపరాక్రమంబులు రావణుని బొగడి యిట్టి దుష్కార్యంబులు జేయించుట కక్కఱకువచ్చునుగాని సంగ్రామరంగంబున నిలిచి యీ రామలక్ష్మణులతోఁ బోరుట కక్కఱకురావు.

మహో—ఓయీ! మాల్యవంతా! నేనంతపౌరుషహీనుండనని తలంచితిగా.

మ॥ మును దేవేంద్రుని సంగరాంగణములో • భూరిప్రతాపుండనై
తనసైన్యంబులతోడఁ బోరునటులన్ • దర్పంబుదూలించితిన్
విను రాముండననెంత సంగరమునన్ • దివ్యద్బలంబొప్పఁగా
దునుమాడంగల రావణాసురుఁడు సం•తోషింప స్వాంతమ్మునన్.

పౌరుషహీనుండనని పలికిన నీనాలుక వేయిచీలికలుకావలదా. ముదుస లివైన నీపరాక్రమముకంటె నాదిహీనమైనదని తలంచితివి. నీశౌ ర్యంబుసంగతి నెవ్వరెఱుంగరు.

కుంభ—(మహోదరుంజూచి)

ఉ॥ ఏమిమహోదరా యిటు లో•కింత మనంబుననెంచ కీగుణ
స్తోముని దిట్టసాగితివి • శూరునినీతని నూరకుంటి నీ
రాముని రోధినింగని ; దు•రాత్ముఁడ ; యట్టులెగాకయున్న నిన్
భూమికి నీయకుండె బలి • పూర్ణభూజావిభవప్రసిద్ధిగన్.

మ॥ ఇకనైనన్ మదిదాల్మిబూనదగు నీ•కెంతైనఁగాకున్నచో
సకలజ్ఞానిని మాల్యవంతుని దిర•స్కారంబు గావించినన్
సకలాధీశుఁడువచ్చినన్ విడక న•స్మత్కీర్త్యనారాచజా
లకఠోరాహతిఁ ద్రెళ్ళనేతు నిను పా•పా ! జేఁసువీక్షింపఁగన్.

ఇమ్మహాత్ముని కృపాకటాక్షంబుచేతనే మనమందఱమును నీలంకయం దు నిర్భయంబుగనుండుట సంభవించినది. ఇదియంతయు నీపరాక్ర మవంతుని బిక్షయని యెఱుంగుము.

మాల్య—ఓరోరి ! ప్రగల్భవచనాపరాయణా ! మహోదరా ! ఏమందు వు. ముసలివాఁడననియుఁ బరాక్రమము లేదనియునా?

తే॥ గీ॥ విబుధలోకంబుపై దండు • విడిసినప్పు
విబుధనాథుండు సేనతో • విష్ణుశరణు

బొందు టీవెఱుంగుదువె మ • ద్భారవిక్ర
మంబునకుఁ గనుభీతిల్లి • యాత్మయందు.

కపటాంతఃకరణా! నీవప్పటికి జన్మమందితివా!

తే॥ గీ॥ మాల్యవంతుఁడేపాటి స • ద్బలుఁడటంచు
విష్ణుఁజేరి చెప్పుమనుచు • వేఁడుకొనుము
అతనితోఁ బోరినాఁడ ఘో • రాజియందుఁ
గాననతనికే తెలియును • గలుషచిత్త.

నాశక్తిసామర్థ్యంబు లెఱుంగుటకు నీవెంతవాఁడవురా! ఎట్టినీచకార్యంబులు సేయుచుండినను, నెట్టి కుహితోపదేశంబు లాచరించుచుండినను, నీరావణునిజూచి నిన్నుసైరింపవలసివచ్చె లేకున్నచో యీపాటికి నంతకుని గృహంబున కతిథిగాఁ జేయకుందునే. ఇంకనైనను నీవాచాగర్వముమానియుండుము.

రావ—(నవ్వుచు) తాత! నీవెంతకుఁజాలవు.

చ॥ అనిమొన నీవు ఖడ్గమును • హస్తమునన్ ధరియించి నిల్చినన్
వినుమొకఁడైన గెల్వఁగల • వీరుఁడు గన్పడునయ్య చూడ, నీ
ఘనకృపగల్గు మాకిపు • కారుణికోత్తమ సంగరంబులో
మనుజవిభున్ వనేచరుల • భంజనసేయుట యొక్కలెక్కయే.

శా॥ అక్షీణ ప్రకటప్రతాప బలశౌ • ర్యంబుల్ విరాజిల్లగాఁ
బక్షీంద్రధ్వజుతోడఁ బోరితివి మీ • వారెల్ల వహ్వాయనన్
నిక్షేపంబునుబోలు లంకకుమమున్ • జేర్పించితీవయ్య నీ
బిక్షుంగాదొకొ హాయినుంటిమిచటన్ • విజ్ఞానచూడామణీ.

శౌర్యధనా! ఎఱిఁగి యెఱుంగక మహాహ్లాదరుం డాడినపలుకుల కలుక బూనకుము. ఆరాముండు మనదానవుల ననేకుల నంతకునింటికిఁ బం

పి పరాక్రమంబున విజృంభించి చరింపుచున్నాఁడు. ఇంక మనమూరకొనరాదు. కర్తవ్యమేమో చూడవలెను. మామ! వేయేటికి నీవు ఖడ్గంబుదాల్చి సంగ్రామరంగంబున కుతికితివేని వైరిసేనలు పంచబంగాళమైపోవా! నాప్రార్థన మాలకించి నీకుఁగావలసిన బలంబులఁగొని వైరిసేనందాఁకి జయంబుగాంచుము. ఇందుకునంగీకరింపుము.

మాల్య—దైత్యేశ్వరా! నేనును గొంతకాలంబువఱకును లోకకంటకుండనై దేవతలను బాధింపుచు నెట్టకేలకు విష్ణువుచే నోడింపఁబడి యీలంకాపురంబు స్థావరంబుగఁజేసికొని యేజోలికిఁబోక భగవద్ధ్యానపరుండనై కాలంబు గడపుచుంటి. నన్ను మరల నట్టియుద్ధరోద్యోగంబునఁ బ్రవేశపెట్టకుము. ఆరాముని దాఁకి తప్పించుకొనివచ్చుటకు నాకేమిగాక బ్రహ్మరుద్రులకైనను దరంబుగాదు. వేయేల! సీతను వానికిచ్చి శరణుబొంది సుఖించుట శ్రేయస్కరము. అట్లుగాదందువేని నీయిష్టము. నేనుమాత్రము కయ్యము సేయను. ఎందులకేని యేగి తపోవృత్తినుందు.

కుంభ—(రావణునిజూచి) సోదరా! నాచెప్పినపలుకు నీకు సమ్మంతంబైనదా.

రావ—(కోపముతో) ఏమిరా! దురాత్మా! మహాశాస్త్రవేత్తయగు నాచార్యునిభాతి నాకు నుపదేశవాక్యంబులు పల్కుచుంటివి. నీమాత్రము జ్ఞానము నాకు లేదని తలంచితివా. ఇట్టి సమయంబున నీవు మాటలతో నాకార్యము సేయనెంచితివి. కడచినదానింగూర్చి యాలోచించినచో నేమి ప్రయోజనము. కర్తవ్యముకదా యాలోచింపవలెను. కార్యమేతీరున గొనసాగునో యది చూచుకొనవలెను గాని యిట్టి యుపన్యాసమేల. ఓరీ నీచ! ఇటువినుము. అక్కఱకువచ్చినప్పు డక్కుపడువాఁడే బంధుఁడు. ఇదంతయు నేల. నా

పైనీకుఁ బ్రేమానురాగంబుండెనేని యిప్పుడే వైరిసేనం దాఁకి నాశనముగావించి నా కానందంబుగూర్చుము. లేదేని సీయిచ్ఛవచ్చినట్లు బొమ్ము. నేనే సమస్తరణభారంబును వహించెదను.

కుంభ—అన్నయ్యా! ఆగ్రహింపకుము. బంధుభావంబుచేతను, సోదరవాత్సల్యకారణంబునను హితముజెప్పుట నాకావశ్యమగుటచేఁ జెప్పితిని గాని సంగ్రామరంగంబునకు వెనుదీసిపలుకలేదు.

శా॥ అన్నా! యోదశకంఠ! ఘోరసమర ♦ వ్యాపార మేపారఁగా
నన్నీచుల్ రఘురామలక్ష్మణుల ఘో♦రాజిన్ బలంబేర్పడన్
మన్నన్ జేసెద వానరావళులనున్ ♦ భంజించి వేవచ్చెదన్
నన్నుంజూచి ముదంబునందగ మదిన్ ♦ దైత్యాన్వయగ్రామణీ.

అన్నయ్యా! ఇటువినుము.

ఉ॥ చచ్చినదానవావళికి ♦ సంతసమేర్పడ యుద్ధమందు న
స్మచ్చటులాస్త్రశస్త్రములు ♦ బాఱఁగఁజేసి వధించిరాము బల్
స్వచ్ఛముగాఁగఁ దర్పణము♦లన్ రుధిరంబున వీడునట్లుగా
మెచ్చగ నీవు దానవులు ♦ మేకొనిచేసెద కోపమేటికిన్.

త్రిలోకంబుల నొక్కపెట్టున మ్రింగఁజాలిననా కీరాముండెంత. హాహారాక్షసులపడెంచి నిల్చినను రణంబునను వెనుదీయను. ఎవ్వరో నా ముందు సంగ్రామరంగమున నన్నుఁ గూల్చుట నిజమయ్యెనేని యనంతరము నిన్నును దప్పక వధింపఁగలఁడు. పరాభవమందెదనే మోయని యించుకయైనను జింతింపను. నీకై రణంబొనర్చి జయంబుగాంచుటకుఁ గాని లేక మరణమందుటకుఁ గాని సంసిద్ధుఁడనై యున్నాఁడ.

రావ—తమ్ముఁడా! నీబలపరాక్రమము లిట్టివని నేవర్ణింపఁజాల. నీవు

భారమువహించినప్పుడు నాకు జయంబున కేమికొదువ. రణంబునకు నీకుఁ దోడుగ నీ సుపార్శ్వ మహోదరులం గూడఁ దోడ్కొనిపొమ్ము.

కుంభ—అన్నయ్యా! నాకెవ్వరిసాయంబును నవసరము లేదు. (ఇంచుకయూరకుండి) ఇంక నే నాలసింపరాదు. నాకు రణంబున కేగుట కాజ్ఞనిమ్ము.

ఉ॥ అంచితసంతసంబున ర♦ణావని కేగెద శౌర్యవృత్తిమై
మించి పరాక్రమించెదను ♦ మేదినియందు నవానరంబుగా
వించెద; నెల్లదేవతలు ♦ భీతిలుభాతిని రామువార్త వి
న్పించెద నిక్కమంచు మది ♦ నీవు తలంపుము రాక్షసేశ్వరా.

ఇదే నేను భండనమున కేగుచుంటి (సుపార్శ్వుఁడు మహోదరుఁడు తోడరా నిష్క్రమించుచున్నాఁడు)

మాల్య—అబ్బాయీ రావణా! నీతో నింకొక్కసారి కొన్నిపలుకులు చెప్పవలసియున్నవి. ఇదియే కడసారిచెప్పుటయని భావింపుము.

రావ—నీయుపదేశమేమో కానిమ్ము.

మాల్య—వత్సా! ఆగ్రహింపకుము. నీక్షేమంబును గోరినవాఁడనగుటచేఁ జెప్పుచుంటి. జానకీదేవికారణంబునఁగదా మనకు యుద్ధంబును నింతదైత్యనాశంబును గలిగె. ఇప్పుడైనను నీవు బుద్ధిదెచ్చుకొనవైతివి. యోచించి నీవు చూచినను రామునియం దొక్కింతయు నేరము లేదు. ఆతఁడు నీకేమియు నపకారము సేయలేదు. ఆతనికాంతను నీవే ముచ్చిలించికొనివచ్చితివి. ఆమెనొసంగుమని నేను నీకనేకసారులు చెప్పితిని. విభీషణుండుగూడ పెక్కుమారులు నొక్కివక్కాణించె. ఆపలుకులు వినకుండుటయేకాక యతనిని నిష్ఠురంబులాడి గెంటితివి. ఆకారణంబున నతఁడు వైరులఁ జేరవలసినవాఁడయ్యె. అదినీకెంతయు నష్టమని యెఱుంగుము. ధర్మాచారరతుండగు రాముని

తో నిష్కారణవైరము నీకుఁ దగదు. ఇదివఱకే దానవులు పెక్కం డ్రు లెక్కకుమీఱినవారు మడిసిరి. ఇప్పుడైనను నాపలుకు లాలించి యీరాముం డీలంకాపురంబును నంభోరాశిలో ముంచకపూర్వమే సీతనిచ్చి సుఖివై యీయున్నదానవులఁ బాలించుకొనుము. ఈకుం భకర్ణుఁడుగాని గింభకర్ణుఁడుగాని రామునిం దాఁకఁజాలరు. నీవుసీతను రామునికడకుఁబంపుట కంగీకరించితివేని నేనెట్లయినను రాముని పాదంబులపైఁబడి సంధిఘటింపఁజేసెదను.

రావ—ఎన్నిసాగులు చెప్పినను నిదియేకదా. తాతా! నీకువెఱ్ఱియా యేమి!

మ॥ వనమందుండఁగ రామలక్ష్మణులనున్ ♦ వంచించి వేవేగమే
జనకక్ష్మాధవపుత్త్రిఁ దెచ్చితి ; మహా ♦ సంగ్రామమిప్పట్ల, రా
మునికిన్ నాకును బ్రాప్తమయ్యెనుగదా ♦ హో భీతియేలాయిఁకన్
వినుమీ! సీతను వీడనేమయినఁగా ♦ నీ మాల్యవంతాధిపా.

మాల్య—రావణా! ఇటువినుము. దేవతలుజొచ్చుటకభేద్యంబైన యీ లంకాపురంబును నరవానరులెన్నఁడైనను జొచ్చిరా! ఇదంతయు నేల. హనుమంతుఁడువచ్చి లంకాపురదహనం బాచరించినప్పు డొకఁ డైనను నెదిరింపఁగలిగిరా.

చ॥ మడిసి రనేకదానవులు ♦ భండనమందున మొన్న ; నీవునున్
దడయక నేగినన్ వినుము ♦ దైత్యవిరోధి రఘూద్వహుండు, దా
విడచు ననిన్ను నెంత యవి♦వేకుఁడవైతివి యిప్పుడైననున్
పుడమిసుతన్ ధరాధిపుని ♦ బొందుగఁ జేర్పుము సౌఖ్యమందుమా.

పోయినదానవులుపోయిరి. ఉన్నవారినైన రక్షించుకొనుము. బుద్ధిబలం బున నీకంటె నల్పుఁడనైనను వయసున నే బెద్దవాఁడనగుటచే నీక్షే మము విచారించి చెప్పిననాపలుకుల నాలింపుము.

రావ—తాతా! ఇంకఁజాలింపుము.

శా॥ తాతా నాకఁటె భీతినేర్పెదవు వే॥దర్పంబునుంబేర్చి, యా
సీతానాథుని సంగరంబున సుర॥శ్రేణుల్ భయంబంద వి
ఖ్యాతిం ద్రుంచెదఁగాంచెదన్ జయముగాం॥షన్ దైత్యులన్ బ్రోచెదన్
సీతన్ వీడను వేయియేలవినుమా ॥ చెప్పంగనేలా యిఁకన్.

క॥ సురులన్ దర్పమునడఁచితి
నరవానరబలములెంత ॥ నాకుఁదలంపన్
బొరిగొందును శ్రీరాముని
స్థిరజయమును గాంచువాఁడ ॥ సిద్ధముతాతా.

ఇంక నీవావిషయమును బ్రశంసింపక యూరకొనినచో సంతసించెద. పెద్దవాఁడవగుటంజేసి నిన్నేమియు ననఁజాలక యూరకొంటి.

మాల్య—అబ్బాయీ! ఈపలుకు వినుము. నీవు భారతీపతిచేత వరంబులుగాంచునప్పుడు నరవానరులచేఁ జావులేకుండ వరంబుగాంచలేదు. ధరాభారంబు వాపనెంచి యయ్యిందిరాధవుండే రామాకృతిం గైకొనినాడు. ఆతనిని నీవు వేయేండ్లు దపంబాచరించినను గెల్వఁజాలవు. రాముండు సాక్షాద్విష్ణుమూర్తియని నమ్ముము.

రావ—తాతా! మాల్యవంతా! ఈనాకడసారిపలుకువిని నీ యుపన్యాసము చాలింపుము. రాముండు విష్ణుస్వరూపుండని నీవు చెప్పుట చేత సంగరోత్సాహము నాకు మరింత యధికంబగుచున్నది.

మ॥ అతఁడే విష్ణువునైన సంతసమె యు॥ద్యద్ఘోరమౌ సంగర
క్షితిలో గెల్వఁగ శక్యమైనయెడలన్ ॥ జేకొందు సత్కీర్తి, గా
కతఁడే నన్ను వధించినన్ వినుము మో॥క్షానందమున్ బొంది, శా
శ్వతసౌఖ్యంబును బొందువాఁడ మదిలో ॥ భావింప నింకేటికిన్,

(తెరలో)

ఓహో! రావణ పరిపాలిత దైత్యులారా! మీరందఱును నన్ను జూచి మీమీ ప్రాణంబులను నేలఁబాఱవైచి పరుగిడెదరేల. ఏయేబలంబులను నమ్మి మీరావణుండు వనంబునుండి జానకి నపహరించి తెచ్చెనో యాబలంబులనన్నిఁటిని నుఱుమాడుచుండిన శ్రీరాముఁడను. ఇదిగో వినుఁడు.

మ॥ సురలం దోలెను నాలమందల గతిన్ ♦ సొక్కించె గంధర్వులన్
వరవిద్యాధరకిన్నరోరగుల దర్పంబెల్లఁ దూలించె, నా
యురుదేహుండగు కుంభకర్ణుఁడిదె కోపోద్యోగ ముక్తుండాని, నా
కరయుగ్మంబునఁ జిక్కెఁ గాచుకొనుఁడీ ♦ కాంక్షన్ సురారాతులన్.

రావ—(ఆలించి) ఆ! నేనుండఁగా నాతమ్ముఁడు పగఱకుఁ జిక్కెనుగా.

మాల్య—అబ్బాయీ! నామాట లెన్నడు విన్నవాఁడవుగావు. ఎట్లైననను నీవు ధన్యుండవే. సత్వరముగ సంగరరంగంబున కేగి రామునిచేఁ జిక్కిన యాకుంభకర్ణుని రక్షించుకొనుము.

రావ—ఇదిగో పోవుచుంటిని.

(నిష్క్రమించుచున్నాఁడు)

మాల్య—(నిష్క్రమించుచున్నాఁడు)

ఇది తృతీయాంకము.





# శ్రీరామవిజయము.

## చతుర్థాంకము.

రామునిచే నోడింపఁబడి మూర్ఛమునింగిన రావణుని రణంబునుండి తప్పించి సారథి ప్రవేశించుచున్నాఁడు

సూతు— (తనలో) రణంబున నలసినవీరులు విశ్రమించుట కిదితగిన స్థలంబై యొప్పుచున్నదిగాన నీదానవేంద్రుండు మూర్ఛనుండి లేచువఱకు నరదంబును నీవటవిటపిక్రింద నిలిపెదను. వృక్షంబుల నుండియే తెంచెడ మందమారుతంబుచే నీతఁడు త్వరలోనే మూర్ఛ దేరఁగలఁడు. (ఇంచుకయూరకుండి) ఆహా! దానవవంశంబున కెట్టి దుర్గతిప్రాప్తించినది. అంతయు దైవమాయగనున్నదిగాని వేరొం డుగాదు. ఆరామలక్ష్మణులయెదుటఁబడి బ్రదికివచ్చిన దైత్యుండొ క్కఁడునులేఁడే. ఇప్పటికి సమస్తబలంబులును నాశనంబులైనవి. ఇంక నాకుంభకర్ణమేఘనాధసుపార్శ్వలపరాక్రమ మెట్లుపరిణమిం చునో తెలియకున్నది.

(తెరలో)

ఓహో దానవసేనాధిపతులారా! నన్నుగాంచి మీరేల పారిపోయెదరు. ఈబలంబునునమ్మియేనా జానకిని మీదానవేంద్రుఁడు హరించితెచ్చి నది. ధైర్యమునుబూని నిలిచి నాతోఁ గయ్యంబాచరింపుఁడు.

చ॥ ఎవనినినమ్మి పంక్తిగళుఁ • డింతినిజానకిఁ దస్కరించెనో
యెవనిబలంబు నమ్ముచు న•హీనపరాక్రమశాలురణ మమున్

బవరమునందు దాఁకె బలవంతుఁడు నట్టిఁడు కుంభకర్ణునిన్
దివిరివధించినాఁడ నిదె ♦ దేవతలచ్చెరువంది మెచ్చఁగన్.

సూతు.—హా ! ఎంతకష్ట మెంతకష్టము. కుంభకర్ణుని వధించిన యీరాముండు క్రోపావేశమునఁ బరాక్రమంబున విజృంభించి యీచాయకు రాడుగదా. అట్లయినచో మోసము సంభవించునే. అన్నన్నా ! దానవవంశ మస్తమించురోజులు వచ్చినవే. హా ! విధీ !

తే॥ గీ సురలగెల్చిన బలుతౌన ♦ సురులనెల్ల
మనుజనాథుని శరముల ♦ మడియఁజేసి
రావణుని దద్దసుతుని ♦ బ్రిదుకజేసె
నావె యక్కటా కృపలేక ♦ యత్మయందు.

సీ॥ కుంభకర్ణాదులఁ ♦ గూల్చినబలశాలి
చంపకవిడుచునే ♦ శక్రజితుని
నానరాంతకుఁగూల్చు ♦ నతులితశూరుండు
వదలనెంచునె యాసు♦పార్శ్వునిపుడు
సకలదానవులను ♦ సమయించి విడుచునే
బలవంతుఁడైన యీ ♦ పంక్తిగళుని
లంకాపురంబు ని♦శ్శంక బలంబున
ముంచగాఁబోడె యం♦భోధిలోన

తే॥ గీ॥ నకట శ్రీరామచంద్రు శ♦స్త్రాస్త్రములకు
నెదురు గన్పింపకుండెను ♦ నేమిసేయు
రావణుండుమాత్రింబు సం♦గ్రామమందు
నస్తమించును హా ! దాన♦వాన్వయంబు.

రావ.—(మూర్ఛనుండిలేచి) తమ్ముఁడా ! కుంభకర్ణా ! నీకుఁదోడుగావిం

చుటకిదే వచ్చుచున్నాఁడ (సూతుఁజూచి) సూతుఁడా! శీఘ్రంబుగ
రథంబును గుంభకర్ణుఁ డున్నయెడకుఁ బోనిమ్ము.

సూతు—దేవా! త్వరపడకుఁడు.

రావ—ఏమిది! పోనిమ్ము నాకు రథంబే యవసరము లేదు. చంద్ర
హాసమాత్రసహాయుండనై యుద్ధరంగంబులోని కుఱికెదను. (రథ
ము దిగఁబోవుచున్నాఁడు)

సూతు—దానవేంద్రా! శాంతింపుము.

రావ—(కోపముతో) ఏమి రాయిది.

తే॥ గీ॥ భుజబలపరాక్రమంబునఁ ◆ బోరి రాము
హస్తమందునఁ జిక్కిన ◆ యట్టితమ్ముఁ
గావ నేగుచుండెడినన్ను ◆ గరుణలేక
యడ్డగించెదవేల నీ ◆ వకటయిపుడు.

సూతు—దేవా! ఆశ్రీరాముం డింతకుఁబూర్వమే తనప్రతిజ్ఞను నెరవే
ర్చుకొనెను గాన నట్లువక్కాణించితి.

రావ—హా! సకలలోకవీరా! నిస్తులపరాక్రమప్రశస్తా! చతుర్దశ భు
వనభయంకర!

తే॥ గీ॥ ఎవనిప్రాపును మదినమ్మి ◆ యింద్రునైన
సరకుసేయకయుంటిని ◆ సమరమందు
నట్టి నాదక్షిణభుజంబ! ◆ యనుజకుంభ
కర్ణ! యరిగితే నను వీడి ◆ కాలుపురికి.

ఉ॥ భీమపరాక్రమంబునకు ◆ భీతిలి పాఱెడిభాతి ఘోరసం
గ్రామమునందు దేవతల ◆ గాసిలఁజేసితి వీవు! నేఁడు శ్రీ
రాముఁడు మర్త్యుఁజేసిన శరంబులకోర్వఁగలేక దేవతా
ధామము జేరితే యకట ◆ తమ్ముఁడ నన్నిటువీడి సోదరా.

సూతుఁడా ! భ్రాతృహంతకుండైన యారాముని జంపలేకపోతినేని నాకీ రాజ్యంబును భాగ్యంబును నేల.

సూతు—దేవా ! ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు.

రావ—సారథీ ! మాతమ్ముఁడు పడియున్నస్థలంబునకు రథంబును బోనిమ్ము. ఆతనింబాసి నే నొక్క త్రుటికాలంబైనను మనఁజాల.

సూతు—ఆయుష్మంతుఁడా ! శోకముడుగుము. యుద్ధంబున జయాపజయంబులు దైవాధీనములుగదా.

రావ—హా ! సోదరా ! వీరరత్నమా ! రిపుదర్పఘ్నా !

(అని మూర్ఛిల్లుచున్నాఁడు)

[అంత మణికంధరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మణి—(తనలో) ఇంకను లక్ష్మణుఁడు వెన్నంటి తరుముకొనివచ్చుచున్నాఁడేమో యను భీతి పోలేదు. (అటునిటుఁజూచి) అమ్మయ్య. ఇప్పటికిఁ బ్రాణంబులు కుదుటఁబడినవి. నే నిప్పుడు దానవేంద్రుండగు రావణాసురుని నెచ్చట గాంచఁగలుగుదును. రాముండు నిజభుజబలపరాక్రమంబున విజృంభించి దశకంఠుని దాఁకి నొప్పించి మూర్ఛపుచ్చ సారథి యారథంబును రణరంగంబునుండి తొలఁగించి పురంబునకే కొనిపోయెనో లేక యెచ్చటనైన నుంచెనో తెలియరాకున్నది. ఎవరినైన నడిగి యాతని జాడఁ గనుగొందమన్నఁ బ్రతివారును గుండెలు బాదుకొనుచు నేడ్చువారె. సకలలోకంబులను గెల్చిన శౌర్యశాలి నేఁడు రంగంబునుండి పారిపోవలసివచ్చెను గదా. నిఖిలదానవులును మడిసిరి. ఈప్రక్క రావణుండు నింద్రజిత్తును దప్ప నెవ్వరును లేరుకదా. ఇంతకును విభీషణహితోపదేశ తిరస్కారంబును, మాల్యవంతనీతి నిరాకరణంబును దానవాన్వయం బస్తమించుటకుఁ గారణంబులైనవి. (ఎదుటఁజూచి) అదిగో నావటవృక్షంబుక్రింద

ఖండితధ్వజరథంబొండు గాఁలుచున్నది. (పరికించి) అదియే తప్పక దానవేంద్రుని స్యందనము. (రథమును సమీపించుచున్నాఁడు)

సూతు—(రావణునితో) దేవా! సంగరరంగంబునుండి మణికంధరుం డరుదెంచినాఁడు.

రావ—మణికంధరా!

తే॥ గీ॥ అరులఁబరిమార్చి రణమున ♦ కరిగినట్టి
పాకశాసనజితుఁడు క్షే♦మంబె చెపుమ

మణి— ఏమివచియింతు క్షేమంబు ♦ నిపుడుమీకుఁ
గేవలశరీరమాత్రంబె ♦ రావణేశ.

రావ—ఏమిరా! ఇదివఱకే మహాచింతాంభోరాశిలోఁ గూలియున్న నాచిత్తంబునకు మరింత సంతాపము గూర్చుచుంటివి.

మణి—దేవరవారి దర్శనంబు లభించుటంజేసి నాయాయాస ముపశమిల్లినది. ఇంక నవధరింపుఁడు. ఇదిగో కుంభకర్ణుని చావువీక్షించి (అర్ధోక్తి)

**సూతు—మణికంధరా! యిదివఱకే దైత్యేశ్వరుండు విన్నవాఁడు.**

రావ—అదినేను వినియేయుంటిని. తరువాతచెప్పుము.

మణి—ఇదిగో కుంభకర్ణుని చావునువిని, సుపార్శ్వుండు దండతాడిత మహోరగంబుకరణి మండుచు మత్తగజతుండంబుల భాతి భుజాదండంబులు సాచి, పండులు గీటుచు, భూనభోంతరాళంబెల్లఁ బ్రతిధ్వను లిచ్చునట్లు బొబ్బలిడుచు "పదపద" మని తనసారథిని దొందరపెట్టుచుఁ గడురయంబున రామునిం దాఁక వచ్చుచుండ, వాలిపుత్రుండగు నంగదుం డాతనికడ్డుపడె.

రావ—తరువాత.

మణి—ఇట్లిరువురును ప్రచండ భండనంబునకు దొడ్కొని యొడలుదె

లియక పోరుచుండ నందు సుపార్శ్వుండు, కాలభైరవావతారంబు దాల్చి యొకప్రక్క నంగదునిపై శరవర్షంబు గురిపించుచు వేఱొక ప్రక్కనుండి కపిసైన్యంబును జెల్లాచెదరు గావించుచుండె.

రావ—సుపార్శ్వుండన్న సామాన్యుండా తరువాత.

మణి—సుపార్శ్వుని హస్తద్వయంబునుండి విడువంబడుచున్న బాణజ్వాలలకు సైపంజాలక కపులు నలుదెసలం బరుగులిడుచుండ, నతండు వారినివిడువక, "ఓరోరీ! మహాపాతకవర్తనులారా! దుష్టవానరులారా! ఇప్పుడుమీ రెందుబోయెదరు. శౌర్యంబును బూని నిలువుండు నిలువుండని రిపుసైన్యంబును వెన్నంటి తనకెదురైన వానరులనెల్ల వీరనక వారనక తనకరవాలంబున కెఱయిచ్చుచు మధ్యాహ్నకాలమార్తాండతేజోవిరాజమానుండై వైరిసేనం జొచ్చి వీరవిక్రమవిహారంబునకుం గడంగెను.

రావ—తరువాత,

మణి—అట్లు పరుగిడుచున్న కపిసైన్యంబునుజూచి "ఓహో! వనచరులారా! ఒక్కమ్మొక్కడిరక్కసునకు మిక్కిలిభీతిల్లి పారిపోవుట మీ కుచితముగాదు. సంగ్రామరంగంబున జయంబుగాంచితిమా శ్రీరామునిచేం గొనియాడంబడుదుము. లేదా చచ్చితిమా వీరస్వర్గసుఖముల నుభవింతుము. అంతియేకాని రిపులకువెన్నిచ్చి పరుగిడుట పౌరుషముకా" దని పలికి వారలనందఱను గొఱ్ఱెలమందను మరలించుకొని వచ్చుగొల్లవానిపగిది మరలించి మరల సుపార్శ్వుం దాంకెను.

రావ—తరువాత,

మణి—అట్లంగదుండు సుపార్శ్వుం దాంకి వీరావేశంబున నతనిరథని కేతనంబులు దుత్తునియలుగాం జేయుటయు రథచక్రంబులు విఱుగంగొట్టుటయు సారథిం జంపుటయు, గుఱ్ఱంబులవధించుటయుం జూచి, కడు రయంబున వేఱొంకరథంబు దెచ్చియిచ్చువాండై నన్ను గన్పింపమికి జిం

తించి యెట్టకేలకు ధైర్యంబవలంబించి, రథంబునుండి నేలకులంఘించి యంగదునితో ముష్టియుద్ధంబునకుఁ గడంగె.

రావ—అయ్యో! ఆతనికి రథముఁదెచ్చియిచ్చువాఁడైనను గన్పడలేదా. మణికంధరా! చెప్పుము.

మణి—తరువాతనేమిచెప్పుదును. ఇరువురకును నొక్కింతకాలము ముష్టియుద్ధంబుజరగ, నంగదుండు భుజబలంబేర్చి, సుపార్శ్వునిపాదద్వయంబును దనహస్తద్వయంబుచేఁబట్టి బాణావలె గిరగిరఁద్రిప్పుచు నేలంగొట్టి యంతకునింటి కతిథింజేసె.

రావ—హా! సుపార్శ్వా!

ఉ॥ సీతనుఁజంపఁబోవఁగను ♦ ఛీ! యదిపాపమటంచు నాకునుఁ
నీతినిబల్కినావుగద ♦ నీరజనేత్రిను జంపియున్నచో
భూతలమందు నిట్టి పెను ♦ ముప్పులుసంభవమౌనె; వానరుం
డాతతఁ జంపఁగాఁగలిగె ♦ నా యకటా నిను బ్రాణమిత్రమా.

తరువాత,

మణి—ఇట్లు సుపార్శ్వుండు మడియుటయు, దనుజబలంబులు వెన్నిడి పరుగిడుటయు, పరిపంథి బలంబున సింహనాదంబులు మెండగుటయు వీక్షించి బ్రహ్మదత్తవరుండును, దేవతాకాండభయాపాదియు, దేవరపుత్రుండును నగు నతికాయుండు, నర్కసహస్రనిభంబగు రథం బధిరోహించి కదురయంబున సేనలం బురకొల్పికొనివచ్చి కపిసేనం దాఁకె.

రావ—అతికాయుని జూచిన దేవతలే పికాపికలగుదురు. మణికంధరా! చెప్పుము.

మణి—ఇట్లుదాఁకిన యతికాయుని ప్రయోగనైపుణ్యాశరశరాసనమును, భుజబలకౌశలంబును జూచి వైరులు వెన్నిడి పాఱఁగడంగిరి,

రావ—భళిభళీ. అనంతరము

మణి—మహాప్రభూ! అరణ్యంబున జింకలను సింహంబు బెదరించువిధమున సైన్యంబును దోలుచు నయ్యతికాయుండు లక్ష్మణుని విలోకించి "ఓరోరీ! మానవాధమా! చాపశరపాణివై బలవిక్రమంబేర్చి యేతెంచినాఁడ. మీలో నాతోఁ బోరఁగలవాఁ డుండెనేని సత్వరమ్ముగ రణరంగంబున కవతరించుఁ" డని గంభీరంబుగఁ బలికిన నక్షీణరూక్షేక్షణాతీక్షుణుండై లక్ష్మణుం డతనివీక్షించి "ఓరీ! దానవాధమా! ఇదివఱకు నాహస్తంబులఁబడి చచ్చిన రాక్షసావళిం జ్ఞప్తికిదెచ్చికొనుము. అస్మదీయహస్తముక్తశితమార్గణపంక్తి సహింప నీకుఁ దరంబుగాదు. ఆశీవిషంబులఁ బోలు మదాశుగంబులు నీదురక్తమాస్వాదించితీరును." అని ప్రత్యుత్తరంబిచ్చి కల్పాంతమృత్యుంజయావతారుండై వివిధనారాచపరంపరలఁ గురిపించుచు నాతని నెదుర్కొనెను.

రావ—తరువాత.

మణి—ఆలక్ష్మణునిచేఁ బ్రయోగింపఁబడు శరంబుల కొక్కింతయైనను లక్ష్యపెట్టక మన యతికాయుండు వాటినన్నింటిని దుత్తునియలుగాఁ జేయుచుండెను. ఇట్లు దనశరంబొక్కటియైనను బనిసేయకుండుటఁ జూచి సౌమిత్రి యేమియు సేయఁజాలక నిర్ఘాంతుఁడై యుండ పవనుండేతెంచి యాతనినిగాంచి "ఓయీ! లక్ష్మణా! ఈయతికాయుండు బ్రహ్మవరంబునంజేసి యవధ్యతనుత్రాణుండై యొప్పుచుండు. ఏశరంబుచేతను వీనిని నణఁపఁజాలవు. బ్రహ్మాస్త్రంబున వీఁడు వధ్యుండుగాఁగలఁడు. కావున దదస్త్రంబు సంధించి వీనిపైఁ బ్రయోగించి నేలంగూల్పు" మని పలికెను.

రావ—అక్కటా! పవనుఁడెంతపనిజేసెను. మణికంధరా! ఇంకఁజెప్పనక్కరలేదు. (చింతిల్లుచున్నాఁడు)

మణి—అట్లుపవనుండు వచియింప లక్ష్మణుండు బ్రహ్మాస్త్రంబును సంధించి మంత్రించి యతికాయునిపై విడిచెను. అతికాయుం డించుకయైనఁ జలింపక తనశక్తి సామర్థ్యం బంతయు వినియోగపఱచుచుఁ బెక్కుశరంబుల దానిపైఁ బ్రయోగించెనుగాని వాటినన్నిఁటిని నాబ్రహ్మాశరము భస్మీపటలంబు గావింపుచు మణికిరీటప్రభామండిత శిరంబును సశిరస్త్రముగ నేలంగూల్చె.

రావ—హా! యతికాయా! విధాతవరప్రసాదలబ్ధ మహాబలపరాక్రమసంపన్నా!

తే॥ గీ॥ బ్రహ్మచేఁ బెక్కువరములు ♦ వడసినావు
ఆలమందున విబుధులఁ ♦ దోలినావు
అంతకున కంతకుఁడవౌచు ♦ నలరినావు
మడసినాఁడవె నేఁడొక్క ♦ మర్త్యుచేత.

మణి—అట్లయ్యతికాయుండు మడియుటంజూచి మనసేనలన్నియు విచ్చలవిడిగఁ బరుగెత్తుటవీక్షించి బలంబులకు మోసమువచ్చెనని తలంచి యింద్రజిత్తు కసురయంబున సేనాసమేతుఁడై కపిబలంబులఁదాఁకె.

రావ—తరువాత.

మణి—ఆసమయంబున విభీషణప్రబోధితుండై మన యింద్రజిత్తును రామునితమ్ముండగు సౌమిత్రి దాఁకి పోరఁగడంగె. వారిరువురి సమర చిత్రంబును వర్ణించుట శేషునికైనను దరంబుగాదు. వారిరువురును రణంబాచరించుతఱిని వికటగతిం బరతెంచు రథగజతురగపదాతిచరణతలసంఘట్టనంబులకుఁ గెంధూళి మార్తాండమండలంబుగప్పుటయు, భూగగనాంతరాళంబెల్ల మహాంధకారంబుచేఁ గప్పఁబడినై నికులకుఁ గన్నును మిన్నును దెలియనీయక భయంబుగలుగఁ

జేయుచుండ నయ్యిరువాగులవారును రణంబునకుఁ గడంగి మోహరించిన శంఖముఖానేకవాద్యంబులును, మత్తకరిసముదయబృంహితములును, రథనిచయసంఘట్టనములును, తురంగబృందహేషావిశేషనిస్వనంబులును, వీరభటుల హుంకారసింహనాదంబులును, ధనుర్జ్యాటంకారశబ్దంబులును, వెన్నిడి పరుగిడుచున్న తమతమ సేనలను బురికొల్పుచుఁ, బేరుఁబేరునబిల్చు సేనాధిపతుల యాహ్వానరవంబులును బ్రతిధ్వనులిచ్చునట్లు కేకలిడుచు, వీరవరులు ప్రచండగదాదండంబులు బూని యొండొరుల మోఁదికొనియుఁ బరిఘంబులచేఁ దలలు బగులఁగొట్టికొనియు, శరంబులచే నురంబులుగాడనేసియుఁ, గరవాలంబులచేఁ గంఠంబుల నఱికియు, బాణవర్షంబు గురిపించియు, నిట్లు ఘనశౌర్యవిజృంభణమునఁ బోరుచుండిరి. అప్పుడా సంగరరంగంబు విభిన్నకాయంబులై నేలంగూలు శుండాలంబులును నిహతసారథికంబులై తెరలిపారు తేరులును, నెత్తురులు గ్రక్కుచు నుక్కుచెడి మ్రగ్గు పదాతులును, గలిగి యుద్వేలకీలాలపూరంబులు నీరంబుగ, సామజకళేబరంబులు తీరంబులుగ, ఖండితవీరభటకరచరణాదులు జలచరసముదయంబుగఁ, బాండురాతపత్రోష్ణీషసమూహంబులు హంసంబులుగ, వికీర్ణకేశపాశంబులు శైవాలములుగ, మాంసపుముద్దలు దీవులుగ, గీకసగణంబులు శంఖంబులుగ, రక్తనది పొంగిపారల భూతభేతాళశాకినీగణంబులును, గంకగృధ్రకలరవంబును గలిగి భండనభూమి మిగుల భీభత్సంబైయొప్పె.

రావ—మణికంధరా! ఇప్పుడిందప్రజిత్తేమిచేయుచున్నాఁడు.

మణి—దేవా! ఆలక్ష్మణునితో ఘోరంబుగఁ బోరుచు నన్నుఁబిలిచి "మణికంధరా! నీవు మాతండ్రికడకుఁ బోయి రిపులతో పోరు ఘోరంబైయున్నదనియు, నే నొంటరినైతిననియుఁ జెప్పి సత్వరంబుగ దేవరను సమరతలంబునకు విచ్చేయుమనిచెప్పె.

రావ—సూతుఁడా! సత్వరముగ రథంబు గృహంబునకుఁ బోనిమ్ము. ఇంచుక విశ్రమించి సమరభూమికి నేగుదము. మణికంధరా! నీవు తక్షణంబేగి కుమారునితో నిప్పుడే రణంబున కేతెంచుచుంటినని చెప్పుము.

మణి—చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.





# శ్రీరామవిజయము.

## పంచమాంకము.

### రావణునిసౌధము.

[రావణుఁడు ప్రవేశము]

రావ—(తనలో)

మ॥ అరరే ధాత యొసంగినట్టివరముల్ ♦ వ్యర్థంబులై పోయె, సం
గరరంగంబున నింద్రు వజ్రధరునే ♦ గాసిల్లఁగాఁజేసి యీ
కరణిన్ గెల్వఁగలేకపోతిని నరున్ ♦ గాలంబునేమందు, హా
నరులే దైత్యులగెల్వసాగిరి మదిన్ ♦ భావించివీక్షింపఁగన్.

వెనుకనొకనాఁడు విరించి నీకుమానవులవలనఁదప్పక భయముకలుగునని చెప్పినాఁడు. అది నిజంబయ్యెనుగదా.

తే॥ గీ॥ బ్రహ్మచేతవరంబులఁ ♦ బడయునపుడు
మర్త్యులఁదలంపనైతి దుర్భావమూని
యకట ప్రాణంబుమీఁదికి ♦ నదియె తెచ్చె
గర్వమేనన్ను నెప్పుడు ♦ కట్టికుడిపె.

ఇదియటులుండ, మున్నయోధ్యలో నిక్ష్వాకువంశసంభవుండగు ననరణ్యుఁడనియెడు నవనీంద్రుఁడు సంగ్రామంబున నాచేఁద్రెళ్ళినప్పుడాతండు నన్నుఁజూచి పుత్రామాత్యభృత్యాదివర్గంబుతోఁగూడ రణంబున నీతలఁద్రెళ్ళనేయు శూరుం డస్మదన్వయంబున నే జన్మించునని చెప్పె. ఆతనిపలుకులు సత్యమయ్యెనుగదా.

తే॥ గీ॥ వేదవతియననొప్పెడి ♦ వెలఁదినన్ను
మున్ను శపియించి యుండదే ♦ నిన్ను నీకు
లంబు దప్పక నేనాశ♦నంబుజేతు
నంచు నక్కాంతయేసీత ♦ యయ్యెనకట.

పార్వతీదేవియు, రంభయు, నందియు, వరుణునిసతియుఁ బల్కినదేఁ
నిజంబగుచుండె.

ఉ॥ ఎన్నఁడునైనఁగాని నరు ♦ లెవ్వరులంకనుముట్టడించిరే
ఎన్నఁడునైన నాదనుజు ♦ లెవ్వరిచేతనునైనఁగూలిరే
ఎన్నఁడునైన నేను నరి ♦ కిట్లు భయంబునుబొందియుంటినే
యన్నియుఁ జిత్రభంగిని మ♦దాత్మకుఁదోఁచుచునుండె నిప్పుడున్

ఉ॥ అంతటిశౌర్యవంతులు మ♦హాహవరంగములందునెప్డు దు
ర్దాంతపరాక్రమంబునను ♦ దర్పముబెరిచి దేవతాళినే
యంతమునొందఁజేసిన ప్ర♦హస్తుఁడు తమ్ముఁడు కుంభకర్ణులే
యంతమునొందినారలు న♦రాధిపుహస్తములందు నక్కటా.

మహాశూరులై చతుర్దశభువనంబుల నెక్కుపెట్టునఁ జప్పళింపఁజాలిన దా
నవవీరులందఱును నరులచే మడిసిరి.

(తెరలో)

వ॥ అకటా శూరుఁడు రావణాత్మజుఁడు న♦ద్వద్యూరథీరుండునున్
వికటాయోధనపాండితీవిభుఁడు బల్ ♦ వీరాదివీరుండు, నేఁ
డొక సౌమిత్రికరంబు సోఁకబడి జ♦న్యోద్యోగమున్ బూని యం
తకునింజేరెనటంచుఁ దెల్పఁగను వా♦ర్తన్ దెచ్చె నాసూతుఁడున్.

రావ—హా! కుమారా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

సూతు—దేవా! ఊరడిల్లుఁడు.

రావ—(మూర్ఛనుండి లేచి) హా! కుమారా! శౌర్యసాగరా! దేవతా
లోకభయంకరా!

తే॥ గీ॥ సకలవీరులు మడిసిరి ♦ సంగరమున
నీవు జయముగొందువటంచు ♦ నెంచియుంటి
నక్కటా యింతలో నిట్టు ♦ లౌనటంచుఁ
దలఁపనైతి కుమార చి♦త్తంబునందు.

శా॥ ఉన్నా! యింద్రవియాంత వానిని రణ ♦ వ్యాపారమేపారఁగా
మెన్నో భంగుల నోడఁజేసితివి నీ♦ వెంతేనిధీరుండవై
యన్నీరేజభవుండు నీకొసఁగె నా♦హా యింద్రజిన్నామ మో
యన్నా! శౌర్యమువమ్ముజేసితివె యా♦హా కూలితే మర్త్యుచేఁ.

తే॥ గీ॥ అఖిలశస్త్రాస్త్రవిద్యల ♦ నభ్యసించి
పూర్ణపండితుండవగుచుఁ ♦ బొల్పుమీఱు
నిన్ను మర్త్యుండు దునుగూడె ♦ నన్నమాట
నమ్మఁజాలకున్నంటిని మేఘ ♦ నాథ యిపుడు.

హా! కుమారా! మేఘనాధా! నీశౌర్యంబున కీర్తిలోకంబులయందును నెదురులేదని తలంచితినిగాని, యీరీతిని దుచ్ఛుండగు మర్త్యుచేఁ గూలుదువని కలనైనందలంపనైతి. నాయినా! శక్రజితీ! సమస్త బలంబులును మడిసినను నేనంతగా విచారింపక నీవొక్కండవే నాకు జయంబుగూర్తువని నిండుముదంబుతోనుండ, నన్నును నీయుంబను విడనాడి యమపురంబు జేరితివా!

(అని విలపించుచున్నాఁడు)

సూతు—దేవా! యూరడిల్లుఁడు.

రావ—సూతుఁడా!

తే॥ గీ॥ ఎవని మదినమ్మి రణమున ♦ నెంతయైన
జయముఁగాంచనెంచితో మానసంబునందు
నట్టి లోకైకవీరుఁడౌ ♦ యాత్మజుండు
బాసి చనియె నేఁడక్కటా ♦ వరముగతికి.

అట్టిచో నేనూరడిల్లుటయెట్లు.

తే॥ గీ॥ కష్టసుఖములు జీవికే ♦ కాలమందు
వచ్చుచుండునుగాని నా♦వరకుమారు
మరణమెంచగ నెప్పుడు ♦ మఱపురాని
చింతయయ్యె సుమీ నాదు♦స్వాంతమునకు.

(తెరలో)

హా! నందనా! మేఘనాథా!

తే॥ గీ॥ సర్వదేవతల ననిలోఁ ♦ జాలగాసిఁ
జేసి, నేఁడొక్క మర్త్యుచే ♦ వాసితఱిగి
దేవతాధామమునుజేరి ♦ తే కుమార
పెట్టితే నాదుకడుపునఁ ♦ బెద్ద చిచ్చు.

సూత—దేవా! మందోదరీదేవిగా రిటువచ్చుచున్నారు.

రావ—ఇస్సీ! సూతుఁడా! పుత్త్రుని గోల్పోయి నేనిప్పు డామెముఖం బు జూడఁజాల. అదిగో! చూడుము.

ఉ॥ కన్నుల నశ్రుబిందువులు ♦ గాల్వలు గట్టగ నేడ్చుచుండి, వి
ద్వన్నుత శౌర్యశాలి సమ♦దారగుణోదయ మేఘనాథ నా
కన్నకుమారయంచుఁ గడు ♦ గాసిలుచుం జనుదెంచుచున్న న
య్యన్నులమిన్న నేవిధిని ♦ హా కనఁజాలెడి వాఁడ నక్కటా.

తే॥ గీ॥ సకలదానవబలములు ♦ సమసెనంచు
నిదివఱకె ఘోరచింతచే ♦ నెగడుచుండె
పిడుగు చనుదెంచి మీఁదను ♦ బడినయట్లు
పుత్త్రమరణంబు ప్రాప్తించె ♦ పూవుబోఁడి
శోకమాపంగ శక్యమే ♦ నాకుఁ జెపుమ.

సూతుఁడా! నేనిప్పుడామెకుఁ గనఁబడకుండ నెందైనం బోయెద.

సూత—దేవరవారిట్లు చేసినచో దేవిగారు మరింత దుఃఖింతురుగదా.

రావ—(నిట్టూర్పువిడిచి) ఏమిచేయుదును.

[మందోదరి ప్రవేశించుచున్నది.]

సూతు—దేవా! దేవిగారు సమీపించుచున్నారు.

రావ—(మందోదరిని జూచి)

మ॥ రణమందుర్ రఘురామచంద్రునివెసన్ ♦ బ్రాణంబులందీసి ర
మ్మని పుత్రాగ్రణిఁ బంపినట్టి ఖలుఁడన్ ♦ బాపాత్ముఁడన్ దుష్టుఁడన్
దనయున్ గోల్పడియిట్లు రాయివగిదిన్ ♦ బ్రాణంబులందాల్చి యుం
టిని నేమందును మున్గినామిపుడు కం ♦ టే దుఃఖవారాశిలోన్.

తే॥ గీ॥ పెద్దలందఱు నేగిన ♦ పిమ్మటఁగద
చిన్న లేగవలయు రణ ♦ క్షితికినట్లు
గాక; ముందుగాఁ బంపించి ♦ నాకుమారు
జెట్టితిని కూర సౌమిత్రి ♦ పొట్టనిప్పుడు.

మందో—హా! తండ్రీ! శక్రజితీ! మమ్ము బిడ్డలులేనివారిగాఁ జేసిపోతి
వా! (విలపించుచున్నది)

రావ—రమణీ! ఏటికీచింత.

తే॥ గీ॥ పడఁతి మనకుమనమె యేడ్వ ♦ వలయు మనకు
మనమె మానసంబున నూరు ♦ కొనఁగవలయు
ధైర్యమునుజెప్ప వారేరి ♦ తరుణిమిన్న
యంతకుని జేరిరందఱు ♦ నాలమందు,

ఇంకఁజింతించినను లాభములేదు.

మ॥ మనసౌఖ్యంబుల కాకరంబనుచు నెవ్వానిన్ మదిన్నమ్మితో
మనకున్నీశ్వరు పీనుఁ జెవనిపై భ్రాంతింతదగన్ బూనితో
మనకండెక్కుడనంచు నెవ్వనిమదిన్ భావించియున్నామొ, యా
తనయుండే మనలన్ద్యజించినని స్వార్థానుంబు జేరన్సతీ.

మందో—బలములన్నియు మొదటమడిసినప్పుడు మీతో రిపులతో సం
ధిజేసికొనవలసినదని యెన్నిమారులు చెప్పినను నామాటవినరైరి.
సమస్తదానవులును మడిసిరి. త్రిలోకంబులనొక్కపెట్టున భస్మీపట
లంబుగావింపఁజాలిన కుంభకర్ణుండును, ధాన్యమాలీసుతుండగు న
తికాయాదిమహావీరులే సంగ్రామరంగంబున వైరులచేఁగూల్పఁబడి
యంతకునింటికతిథులైరి. దేవరతో సమానపరాక్రముండును, నిం
ద్రునిబంధించిన శౌర్యశాలియునగు మనయింద్రజిత్తే సురలోకంబు
నకేగె. కరితురగసముదయంబంతయు నశించినది. భాగ్యంబెంత
యో యంతరించినది. దేవా! ఇంకనెవ్వరికై మీరు రణంబాచరిం
చి జయంబుగాంతురు.

రావ—

మ॥ ఘనబాహాబల మేర్పడంగ, దిగ్జగత్కల్యాణతేజోనిధిన్
దనయున్ జంపిన వైరివీరులను దోర్దర్పంబు దీపింపఁగా
నని భంజించి తదీయరక్తమున నే నత్యంతమిప్పట్ల, ద
ర్పణముల్ వీడెద మేఘనాధునకునున్ రాకేందుబింబాననా.

మందో—నాథా! మీరింకను జయాభిలాషవీడలేదుకదా. ఒకవేళ ర
ణరంగంబున మీరే జయింతురనుకొనుఁడు. ఏమియును లేని యీ
లంక నేలుటకన్న తాపసవృత్తి నుండుట మంచిదిగదా.

రావ—వెఱ్ఱిదానా! మందోదరీ!

చం॥ తనయుని రాజ్యలక్ష్మికిని ♦ దప్పక నాథుని జేసి పిమ్మటన్
వనితరో నిన్ను గూడుకొని ♦ భవ్యవనంబును జొచ్చి యానినై
తనరుటఁ జెల్లుఁగాని యిటు ♦ దైత్యులనందఱిఁ జావఁజేసి, నా
యనుఁగుఁగుమారుఁ గోలుపడి ♦ యక్కట తాపసవృత్తి జెల్లునే.

అదియుంగాక నే నిప్పుడు తాపసవృత్తిని బూనితినేని రామునితోఁ బోరుటకు భీతిల్లి యిట్లాచరించెనని సర్వలోకంబులు హాసింపవా.

మండో—ప్రాణేశ్వరా! పౌరుషాభిమానధనులగు మీరట్లు వక్కాణింతురుగాని సంధిజేసికొనుట వీరపురుషుల లక్షణంబేకదా. శ్రీరామచంద్రుండు సాక్షాద్విష్ణుస్వరూపుండనియు, దైత్యవధార్థమై యవతారమెత్తెననియు, మాల్యవంతుఁడు వచించినాఁడు. ఇదివఱకే యందఱిని వధించి భుజబలపరాక్రమంబున విజృంభించి సంచరింపుచున్నాఁడు. మీకు రణంబున సహాయంబాచరించుట కెవ్వరును లేరు. ఇప్పుడయినను నామాటలాలించి యాసీతను రామునికిచ్చి సుఖులై యుండుఁడు. ఇంతకుమున్నే యిక్కార్యం బాచరించియుంటిరేని దానవప్రకరం బింతగా మడియకనేయుండును.

రావ—

మ॥ వనితా లోకములెల్ల బెగ్గిలఁగ దర్పంబేర్చి, వీరావళిన్
రణరంగంబులఁ బారదోలుచును లంకారాజ్యమున్ దాల్చి, యిం
దనుకన్ బాలన మాచరింపుచును జిత్తంబందు భీతిల్లి, యా
జనపాలున్ శరణంబుబొందినను నిర్చన్ నవ్వవే లోకముల్.

ఉ॥ చచ్చినఁ జావఁగానలెను ♦ సంగరరంగమునందుగాక న
న్మెచ్చుటులాస్త్రసంపదకు ♦ వ్యోమపతిమైనను జావగావలెన్
మచ్చికలేల యింక నసుమానము వీడుము చిత్తమందు నేఁ
జొచ్చెద సంగరంబునిదె ♦ చూడుము మద్భుజవిక్రమంబునన్.

తే॥ గీ॥ చంద్రహాసంబు నాదు హస్తంబునందుఁ
దాల్చియుండియు నేల చిత్తంబునందు
శాత్రవానీకమున కేను జడియ; నబల
రణమునందునఁ గూల్తు శ్రీరామచంద్రు.

అంతియేకాని దేహంబున జీవంబు లున్నంతవఱకును పగఱను శరణు బొందను. సకలదానవులును మడిసిరని భయపడను. సమస్తజగంబులును నొక్కపెట్టున నెత్తివచ్చినను నే నొక్కండను నొక్కపక్కనిలిచి కయ్యంబాచరించెద.

మండో—నాథా! నాపలుకాలకింపవా! ఇప్పుడాసీతను రామునకొసంగి మీరైనను సుఖంబుగనుండుఁడు.

రావ—రమణీ! నీవింకనాప్రశంస నాపుము. సమస్తబలమును శత్రులపాటఁబెట్టి, సోదరాత్మజులఁగోలుపోయి నొక్కఁడనమిగిలియుండిన నేను రణంబునజయంబైనను, నపజయంబైనను బొందుటకు సంసిద్ధుఁడనైయుంటి. ఈతుచ్ఛశరీరంబునకాసపడి, రిపులతో సంధిజేసికొనునంతటినీచకార్యము మఱొక్కటిలేదు. (ఆకాశమువంకఁజూచి) సూతుఁడా! అటుఁజూడుము. ఇప్పుడు రెండుజాములరాత్రికదా యైనది. సూర్యుఁడుదయించుచున్నట్లున్న దే.

సూతు—దేవా! అదిసూర్యోదయముకాదు. దేవరశక్తిచేఁబడినలక్ష్మణునిమూర్ఛదేర్చుటకై హనుమంతుండు సంజీవి దెచ్చుచున్నాఁడు. అదియే యాకాంతి.

రావ—అన్నా! ఆహనుమంతుఁడిప్పుడు సంజీవినిగొంపోవుచుండెనుగాని సూర్యోదయంబయ్యెనేని లక్ష్మణుం డంతంబొందునుసుమా. అక్కటా! నేననుకొన్నదానికి భంగంబైనదిసుమా. అగుఁగాక నాకేమిభయము.

మందోదరింజూచి) తరుణీ! నీవింకమందిరంబులోనికేగుము. నేనిదేమదీయవనంబునుజొచ్చి యుందోరునికిఁదెలియకుండ మంత్రప్రయోగంబుజేసి, రామలక్ష్మణుల హతంబుగావించెద.

మందో——నాథా! నేఁజెప్పుమాటవినవా.

రావ——ఇంకమారుబలుకక సత్వరమ్ముగనేగుము సూతుఁడా! రథంబులోనికిఁబోనిమ్ము.

సూతు——చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము.





# శ్రీ రా మ వి జ య ము.

## షష్ఠాంకము.

[ప్రవేశము రామలక్ష్మణులు హనుమద్విభీషణులు]

రాము—విభీషణా!

సీ॥ కాలకాలునిబోలు ♦ కాలనేమిని లీల
నాజిలో దర్పంబు ♦ నడఁచినాము
అజవరప్రాప్తసాహస ♦ డా యతికాయుని
యమసన్నిధికిఁబంపి ♦ యలరినాము
లోకైకవిఖ్యాత ♦ మాకుంభకర్ణాబ్ధి
నంచితంబుగఁ దరి♦యించినాము
అమరలోకములకు ♦ నతిభయంబునుగొల్పు
నింద్రజిత్తుని సంహ ♦ రించినాము
తే॥ గీ॥ తక్కుగలవీరవర్యుల ♦ దానవులను
జించిచెండాడి బలమున ♦ మించినార
ముగ్రరణకోవిదుండౌచు ♦ నొప్పునట్టి
దశముఖునియందుమాత్రంబు ♦ దగిలెశంక.

విభీ—దేవా! మీకాశంకయేలకల్గవలెను.

రాము—తే॥ గీ॥ బవరమునుసేయ నాత్మలో ♦ భయముపడియొ
కాక, దానవానీకంబు ♦ గాలుపురికిఁ
జేరెనంచును నెంచియో ♦ పారిపోయె
దానవేశ్వరుం డేమూల ♦ దాఁగినాఁడొ.

సోదరుంఉను, సుతుంఉను మడిసిరని చింతాంభోధిలోఁగూలి విరాగియై యస్త్రసన్యాసంబుగావించి యెచ్చటికైనఁ బోయెనో లేక సమస్తబలంబులు నశించెనని శరణుబొందునేమో. అట్లయినచో నాతనివధించుట దుర్లభంబుగదా.

విభీ—ఆతం డట్లాచరించువాఁడుకాఁడు. యుద్ధంబునకుఁదప్పకవచ్చును.

లక్ష్మ—ఏమాయయోపన్నుచు నెచ్చటనోడాఁగియుండుననియూహింతు

విభీ—లక్ష్మణా ! నీవుచెప్పినది నిజంబై యుండును. అయినను నాతనిజాడనెఱిఁగివచ్చుటకుఁ గామరూపియగుదనుజునొక్కనిని బంపితిని గదా. ఆతండీపాటికి వచ్చుచునేయుండును.

రాము—

ఉ॥ ఇందఱదానవాగ్రిణుల ♦ నేపడగించిన నింతయైన నా
నందములేమను మ్మీవుసు ♦ నామదికిఁక నిజమెంచఁ గారణం
బంటు దశాస్యుఁడాఁకుచు మ♦హాభుజవిక్రమమేర్పడంగ వా
నిం దెగటార్ప నాతనము ♦ నిక్కముగల్గుసుమా విభీషణా.

ఉ॥ పోరినవారిఁశోడఁ బరి♦పూర్ణభుజావిభవప్రసిద్ధిగన్
బోరవలెన్ నిజంబుగ న♦నున్ జెనకందగువాఁడతండె సు
మ్మీ రజనీచరుండనఁగ ♦ మేటి రణంబుల వానికీడునౌ
ధీరునిజూడలేదెచట ♦ దేవతలందునఁగూడ మిత్రమా.

లక్ష్మ—అన్నయ్యా ! నీవుచెప్పినది నిజంబేనుమా.

తే॥ గీ॥ అతని శౌర్యధైర్యములకు ♦ నతనితపము
వృద్ధికి సుసంపదలకు దు♦ర్బుద్ధిలేక
యున్న దేవేంద్రపీఠంబు ♦ నొప్పమీర
స్వీకరింపంగఁ దగువాఁడు ♦ లోకమందు.

క॥ పరనారీహరణంబును
సురులను హింసించుట; పరిశుద్ధుల మానీ
శ్వరులను నేచుటయును నా
సురరిపునకు గుణములౌచుఁ జూపట్టెఁజుమీ.

విభీ—అందుకు సందియమేమి. అవియేకదా యింతమట్టుకుఁ దెచ్చినవి.

[ఒకదైత్యుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విభీ—(దైత్యునిజూచి) ఏమిరా! రావణుని జాడ నేమైనఁ గనుఁగొంటివా!

దైత్యు—ఏలకనుఁగొనకుందును.

రాము—జాడ తెలిసినదా.

దైత్యు—చూచివచ్చితివాయని యడుగుఁడు.

లక్ష్మ—చూచియేవచ్చితివా.

దైత్యు—దేవా! మీయాజ్ఞను శిరంబునఁదాల్చి యారావణాసురుని జాడ నెమకుటకై బయలువెడలి పురంబంతయుఁ గామరూపినై యెవ్వరికిఁ దెలియకుండ గాలించితినిగాని యెచ్చటను గాన్పింపలేదు. అంతట నే నుద్యానవనంబులన్నియు నెమకి రావణమహోద్యానవనంబునకుఁ బోవ నచ్చట నొకమూల వీరులైన దనుజావళి పరివేష్టింప, మహామంత్రింబులు పఠింపుచు హోమం బాచరింపుచున్నవాఁడు.

లక్ష్మ—ఏమి యీపిచ్చి!

తే॥ గీ॥ అస్త్రశస్త్రంబులను బూని యాజియందు
మమ్ము వీరులగెల్వంగ భయముజెంది
మంత్రముల జపియించియా! మమ్ముఁజంప
దలఁచినాడు చిత్తంబున దైత్యవరుఁడు,

విభీ—

శా॥ దేవా యాతఁడొనర్చు హోమమున కర్థిన్ భంగమున్ దేవలెన్
భావింపన్ దరిగాదు; కానియెడ నాపద్యార్థిలో సుంచు, మి
మ్మావిశ్వంభర, మీకుపద్ధతిమ వమ్మేయజాను; మాయావి యా
దేవారాతిని బోలువాఁడు రిపుభేదీ లేడు లోకంబులన్.

లక్ష్మ—అన్నయ్యా! విభీషణుఁడు చెప్పినది నిజంబై యుండును.

మ॥ ఇఁక సందేహముబొందనేల మదిలో నిప్పట్లవేఁబోయి, స
త్ప్రకటప్రాభవధీర వీరగుణ దర్పంబుల్ విరాజిల్లఁగా
వికటాయోధనలీల దేలఁగను నవ్వీరున్ దగన్ బిల్చి, తా
వక నారాచపరంపరాగ్ని శలభంబౌ నట్లు జేయుందగున్.

హను—దేవా! మీరు నాకాజ్ఞయిచ్చినచో నేనొక్కండన నక్కడకేగి యాదానవేంద్రుని నావాలంబునకుఁ జుట్టితెచ్చి మీసముఖంబునందు బెట్టెదను.

లక్ష్మ—హనుమంతా! నీవంత వాఁడవే యగుదువు మరియు,

ఉ॥ వానరసేన నడ్పుచును భానుసుతుండును, ముఖ్యమంత్రిగా
దానవనాథ సోదరుఁడు దప్పక నందఱు నెప్పుడోపుచున్
మానక నీవునుండగను భండనమందు జయంబుగాంచ భూ
జానికి నెంతకార్యముగు స్వాంతమునం దలపోసిచూడగన్.

రాము—(విభీషణునిజూచి) విభీషణా! ఇంక మనమాదైత్యుండున్న వనంబున కేగుదము. రమ్ము.

విభీ—చిత్తము. (అందఱును నడచుచున్నారు)

(అంత తెరలేచును)

## ఉద్యానవనము.

### ప్రవేశము—రావణుఁడు.

రావ—(తనలో) సురసిద్ధయక్షకిన్నరకింపురుషగరుడోరగాదులును బ్రచండభండనంబులయందు నోడించిన నేనొక్క మర్త్యునికి భీతిల్లి, శరంబులఁ గరంబులఁబూని రపునిగెల్చుటకు సందియమంది మంత్రంబులచే వారిని జంపవలెనని యెంచి యిచ్చట డాఁగితినిగదా. హా తమ్ముఁడా కుంభకర్ణా! కుమారా మేఘనాథా!

ఉ॥ ఘోరరణంబునందు నొనఁ ♦ గూర్తురు నాకుజయంబటంచు నిం
పారగ నమ్మి మిమ్ములను ♦ నంపఁగ నాజికిఁబంపి, యక్కటా
శ్రీరఘురాముచే విగత ♦ జీవులుగానొనరించి యొక్కఁడన్
ధారుణిలోపలన్ మిగిలి ♦ నాడను టక్కొకయింత లేకిటుల్.

ఆహా! నేనెంత దుష్కార్యం బాచరించితిని.

ఆహా! విభీషణా! నీవే కడుధన్యుండవు.

చ॥ పలికితివీవు సీతను నృ♦పాలునకిచ్చి సుఖంపుమంచు నీ
పలుకుల నేమియున్ వినక ♦ భండనమే మది నిశ్చయించి నా
బలముల నెల్లఁ గోలుపడి ♦ భవ్యకుమారుని జావఁజేసి యి
ప్పుడిటుల నొంటినైతి చల♦మున్ విడనాడితి భీతిజెందుచున్.

(ఇంచుక యూరకుండి) ఏమిదీ! నేను భయపడనేల. సకలలోకంబులు నొక్కపెట్టున నెత్తివచ్చినను జయింపజాలు సామర్థ్యంబు గలిగి యుండి, చంద్రహాసంబు గరంబునఁ దాల్చియుండి నేనీరీతి నాహీన నరునకు భీతిజెందనేల. ఇంక నేనిప్పుడతినిష్ఠాపరుండనై మంత్రోచ్చాటనంబునంజేసి రామలక్ష్మణుల నంతకునింటి కతిథులగాఁ జేసెద. నానిష్ఠ కెవ్వరును భంగము గలుగఁ జేయరుకదా. అట్లయిన

చో హానియగును. నేనిక్కడ నుంటినని యెవ్వరు కనుగొనఁ గలరు.
(అని మంత్రోచ్చాటనఁ జేయుచున్నాఁడు)

రామ లక్ష్మణ విభీషణ హనుమంతులు—దైత్యుఁడు ప్రవేశము

విభీ—దేవా! యిదియే రావణుండు హోమం బాచరింపుచున్న వనము.

దైత్యు—దేవా! అటువీక్షింపుఁడు. అదే రావణుండచ్చట మహానిష్ఠా గరిష్ఠాత్ముఁడై తపంబు సల్పుచున్నాఁడు.

రామ—(లక్ష్మణునిజూచి) లక్ష్మణా! ఈతనితపోభంగంబాచరించుట యెట్లు.

లక్ష్మణు—మాటలచేతనే యీతని తపస్సునకు భంగముఁ జేయవచ్చును. అన్నయ్యా! నీవుచూచుచుండుము.

సీ॥ దేవతానాథుని ♦ దివ్యద్బలంబొప్ప
దల్పంబడంచిన ♦ ధైర్యశాలి
సద్గుణుండంచు య♦శంబుగాంచినయట్టి
యవ్విభీషణునకు ♦ నన్నగారు
లంకాపురంబు ని♦శ్శంకతోఁ బాలించు
త్రైలోక్యవీరుండు ♦ దైత్యరాజు
కపటంబునిర్మించి ♦ క్ష్మాధీశు శ్రీరాము
భార్య హరించిన ♦ పాపరతుఁడు

తే॥ గీ॥ సంగరంబునమాకును ♦ జాలమదిని
భీతిగని పాఱిపోయిన ♦ పిఱికిపంద
యతఁడు రావణేశ్వరుఁడనంగ ♦ నలరువాఁడు
ఏడనున్నాడో చెప్పుడీ ♦ యెవ్వరైన.

రావ—(కనులు తెఱచి) ఎవ్వరో యిట్లువచ్చుచున్నారు. (ఎదుటఁజూచి) ఎవ్వరోయనుకొంటిని. శ్రీరామలక్ష్మణవిభీషణాదులే వచ్చుచున్నా

రా. వీరు నాజాడ నెట్లుకనఁగొంటిరో కదా. అన్నిఁటికిని విభీషణుఁ డుండెనుగదా. ఆతనికిఁ దెలియనిమాయ యేమున్నది. కానిమ్ము.

తే॥ గీ॥ మించుభీతి రణమునఁ బు♦ట్టించినావు
దివ్యమంత్రముల్ జపియింపఁ ♦ దెచ్చినావు
ఎన్నిమాటలువీరన్న ♦ నింతయైనఁ
జిత్తమా చంచలత్వంబు ♦ జెందఁబోకు.

వీరు నాకడకే తెంచి యెట్టిదుర్భాషలాడినను మారుపలుకక యోర్చి, నాపనినేనుగావించెద. అట్లయినంగాని వీరు మడియరు. (అని జపముజేసికొనుచున్నాఁడు)

[రామ లక్ష్మణ విభీషణులు రావణుని సమీపించుచున్నారు]

లక్ష్మ—(రావణుని వీక్షించి)

మ॥ వనమందున్ వసియింపుచుండఁగ మమున్ ♦ వంచించి ; భూకన్యకన్
గొనితేఁజాలితి వంతియే ; రఘుకుల♦శ్రేణీశునిం గెల్వఁగా
రణరంగంబున నిల్చియుండఁగ భయ♦భ్రాంతుండవై యిట్టులీ
వనమందిప్పుడు డాఁగియుంట పరువా ♦ భావింప దైత్యాధమా.

రామ—

మ॥ కలనన్ నన్నెదిరింపఁజాల కిటు లో♦కఖ్యాతిమై మించి, స
ద్బలుఁడంచున్ ఘనకీర్తిఁగాంచి యిటులీ♦భంగిన్ భయంబంది యా
కులపాటొంది రణంబువీడి చన నీ♦కుంజెల్లునే ధారుణిన్
లలిబృందారచయంబు నిన్ననిమదిన్ ♦ హాస్యింపదే రావణా.

ఉ॥ ఏమిబలంబునమ్ముచు న♦హీనగుణాకరసాధ్వి జానకిన్
నామెయి తస్కరించితివి ♦ యాబలమెల్లను జూపకుండ సం
గ్రామమువీడి పోవుటది ♦ రాక్షసనాయక నీకునర్హమే
భూమిని వీరలక్షణమె ♦ పొందుగ నాత్మఁ దలంచిచూడుమా.

తే॥ గీ॥ సకలదానవబలములు ♦ సమసెఁగూలె
సుతుఁడు నేలపైఁగూలెను ♦ సోదరుండు
నొంటివైతి వేలభయము♦నొంద? లేచి
రమ్ము యుద్ధంబుసేయంగ ♦ రాక్షసేంద్ర.

హను—

చ॥ చదివితి వెల్లశాస్త్రములు ♦ చక్కఁగనేర్చితి ధర్మముల్ జగ
ద్విదితపరాక్రమం డనుచుఁ ♦ బేరును గాంచితి వెచ్చటన్ గనన్
జదివితివయ్య ధీరులిటు ♦ సంగరరంగము వీడిపోవుటల్
యుదితపరాక్రమం బనుచు ♦ నొప్పఁగఁజెప్పము దప్పు కిప్పుడున్.

తే॥ గీ॥ వచ్చియున్నాఁడు శ్రీరామ ♦ వల్లభుండు
లెమ్ము వేగమ్మె యుద్ధమ్ము ♦ నెమ్మిసేయ
నందుమూ జయంబో లేక ♦ యపజయంబొ
ఏల యీరీతిడాఁగుట ♦ యేమిపరువు.

విభీ—

మ॥ అనుజా! సీతను నీయుమంచనిన వా♦క్యంబుల్ దగందోసి, రా
మునితోఁ గయ్యముజేసి సద్బలములన్ ♦ బుత్రున్ మహావీరులన్
రణరంగంబునఁ జావజేసియు భయ ♦ భ్రాంతుండవై యిట్టికీ
వనమం దేటికి డాఁగితయ్య చెపుమీ ♦ వమ్మయ్యెనే శౌర్యమున్.

మ॥ కరముల్ బూని రణంబునన్ నిలిచి స♦త్కార్యంబునుం జేస్తి, వా
స్కరవంశాగ్రణిరాఘవేంద్రుని ద్రిలో♦కారాధ్యు వీరోత్తమున్
ధరణిన్ గెల్వఁగ శక్తిలేక యిటు దో♦ర్దర్పంబు వోనాడుమన్
వరమంత్రింబులఁ జంపనెంచితివె నీ♦భావంబులో సోదరా.

తే॥ గీ॥ శరముపనిసేయదయ్యెను ♦ సమరమందు
నింక మంత్రాళిబాఱునా ♦ యెంతవింత

రాముపై నేటి కీవెట్టి ♦ రణముసేయ
రమ్ము వేగమ్మ భయమేల ♦ రాక్షసేంద్ర.

రావ—(స్వగతము) అహో ! వీరందఱును నాతపంబునకు విఘాతంబాచరించుచున్నారే. హా ! చిత్తమా ! మొదట నభిమానపౌరుషంబులు జంపివేయించి, రణంబునుండి తొలంగఁదీసి యిచ్చటకుఁజేర్చి, యిప్పుడు వీరనుమాటలకు సైపఁజాలక లేచి వీరితోఁ గయ్యంబాచరించుమని ప్రేరేపించుచుంటివా. (ఇంచుకయూరకుండి) ప్రాణముకంటె మానమధికముగదా. వీరిభాషణంబులు నాహృదయంబునకు బాణంబులకంటెఁ దీవ్రంబుగఁదగులుచున్నవి. ఏమైననుసరే వీరితో నేనిప్పుడు రణంబుజేసియేతీరెదను. (అనిలేచి) రామాదులను విలోకించి) ఓరామలక్ష్మణులారా ! ఏల యీమదాలాపములు.

తే॥ గీ॥ సమరమందునఁబడినాఁడ ♦ జాలశ్రమము
విశ్రమించితి నిచ్చోట, ♦ భీతిబుట్టి
గాదు డాఁగియుంటుట, కడు ♦ గర్వమేర్చి
పల్కనేల దుర్భాషలు ♦ పాపులార.

(విభీషణుని నవలోకించి) ఓరీ విభీషణా !

ఉ॥ పెంచితిఁ బెద్దజేసితిని ♦ పెంపుదలిర్పఁగవిద్యనంతఁజె
ప్పించితి ; పుత్రమాడ్కి నవి♦వేకి ! స్వజాత్యభిమానమెల్ల లో
నించుకసిగ్గులేక నిటు ♦ లీక్రియదోసి చరింపనెంచి, తి
ట్లించితపాపకర్ముఁడవు ♦ నై రఘురామునిజేరితే ధరణ్.

తే॥ గీ॥ చుట్టమాదునంచును మదిఁ ♦ జూడలేదు
ఎంచవే భ్రాతృభావంబు ♦ నింతయైన
ధర్మచింతన మొదలనే ♦ దలఁపలేదు
పహలఁజేరిన నీవు సోదరుఁడవౌదె.

తనవారినివీడి రిపులఁజేరినవాని బ్రదుకునిందనీయముగదా. అదియుంగాక తనవారిని విడిచి రిపులఁజేరినవాఁడు, స్వజనులు మడిసినపిదప, రిపులచే నతండు మడియింపఁబడును. నీవిట్లాచరించితివని నాకొక్కింతయైన స్వాంతంబునఁ జింత లేదు.

విభీ—అన్నా! నాకు నీయందభిమానము లేకపోలేదు. నాశీలమెఱింగియు నీవేలపలికెదవు. గుణశీలంబులకు జన్మము ప్రధానము కాదు. రాక్షసకులంబున నేనుజన్మమందినను గుణంబులు రాక్షసగుణంబులుగావు. నన్ను దరిద్రుఁడవని నీవంటివిగాని యుత్తమపురుషులెవ్వరును ననరు. పరదారలనపహరించు పాపరతుఁడవగుటంజేసి నీకిట్టి దుస్థితి ప్రాప్తించినది. నేను నీకిద్దివలదని మున్నే తెలిపితిని. అందుకు నీవాగ్రహపడి నన్నుఁబొమ్మన్న త్రిజగదారాధ్యుండగు శ్రీరాముని శరణంబు నొందితిని. ఇందు నాతప్పేమియు లేదు.

రాము—(రావణునిజూచి)

తే॥ గీ॥ అతిథిగానిట్లువచ్చితిఁ ♦ గుతుకమూని
పెట్టుమీ వేగమే రణ ♦ భిక్షనింత
సందియంబేల పొందంగ ♦ జెందమందుఁ
గూలనేసెద నిన్నిప్పు ♦ డాలమందు.

రావ—(కోపముతో)

మ॥ ఇదె వీక్షింపుము వేయియేల వినుమీ ♦ యీచంద్రహాసంబునన్
బదియార్వ్రక్కలుజేతు నీశిరము ద♦ర్పంబేర్చి యీవానర
ప్రదరప్రక్రియఁజేయువాఁడఁ ద్రుటి సం♦గ్రామంబునం దిప్పడే
మదిలో భీతిలినాఁడనంచును దలం♦పంబోకు మెప్పట్టునన్.

మ॥ సురవిద్యాధర కిన్నరోరగులచే ♦ సాక్కించి దర్పంబునన్
జిరకీర్తిన్ గయికొంటి లోకమున నో ♦ సీతేశ, నీవెంత వా

నరమాతుగ్రింతవు చూడుమీయిపుడె ♦ జన్యాంబంపు మిమ్మిరువ్వరన్
సురలోకంబుచుజేర్తు దేవతలు నన్నుంజూచి భీతిల్లగన్.

రాము——ఓరీ! ఆత్మశ్లాఘాపరాయణా!

మ॥ అరరే యెంతమహాబలుండవోకదా ♦ యానాం డరణ్యాంబులన్
ధరణీపుత్రిక నెంటిఁదెచ్చియు మహా ♦ ధైర్యాంబుగల్గంచు నీ
సరణిన్ బల్కెదవేల హీనచరితా ♦ శౌర్యంబు జూపింపుమీ
దురమందున్ నినుగూల్చువాఁడ సరగన్ ♦ దోర్దండదర్పంబునన్.

రావ——భూపాలాధమా! రణంబునకు సంసిద్ధుఁడనై యుంటి.

ఉ॥ దంచెదఁ బిండిపిండిగను ♦ దప్పక నిప్పుడె మిమ్మునందఱిన్
బంచెదఁ గాలుపోల్రిలికిని ♦ దర్పముఁబేర్చి పరాక్రమంబు జూ
పించెద దేవతల్ కలఁగ ♦ బృథ్విని నెల్ల నవానరంబు గా
వించెద వేయియేల ఘనవీరుఁడవే నీఁక నన్నెదుర్చుమీ.

రాము——ఓయీ! రావణా! అనవసరప్రసంగముతో కాలయాపనం
బేలచేసెదవు. రణంబునకు మొనయుము.

రావ——ఇదిగో! ఈశరంబును గాచికొనుము.

రాము——ఈబాణంబును దప్పించుకొనుము.

(ఇరువురును యుద్ధముసేయుచున్నారు. రావణుఁడు గూలును)

(తెరవాలును)

రంగము——లంకాపురము

రామ లక్ష్మణ విభీషణ హనుమంత సీతలు ప్రవేశము

రాము——విభీషణా! వాగ్దానంబు జేసిన ప్రకారము రావణునిగూల్చి
నిన్ను లంకాపురంబున కభిషిక్తునిజేసితి. పాతివ్రత్యపరీక్షార్థమై

సీత యగ్నిం బ్రవేశించుటయు దేవత లామె మహాపతివ్రతయని చెప్పటం జేసియు నామె నేలగంటి. పదునాల్గు వత్సరంబులు నిండెనని మాకొఱకై భరతాదు లెదురు చూచుచుందురు. మేమేగవలయు. ఇంక నేమికావలెను.

విభీ—దేవా ! సాకేతనగరంబున భవత్పట్టాభిషేకోత్సవంబునకు నేనును హనుమత్సుగ్రీవులును నరుదేరవలెనని కుతూహలమున్నది. ఇందుకు దేవర యంగీకరింపవలయును.

రాము—అట్లేయగుఁగాక. మ రేమికావలయును.

విభీ—నిరంతరము నీకృపాకటాక్షంబుదప్ప మాకేమికావలయును. అయినను నిట్లగుఁగాక.

మంగళమహాశ్రీ.

భూతలమునఁ బ్రజలు ♦ భూరిసుఖముల్ గనుచుఁ
బుణ్యమతులై వెలయుఁగాతన్
సీతముగవర్షములు ♦ నేలఁబడఁగా నెపుడు
నిండుఫలమీయుత పొలంబుల్
ఖ్యాతిగను రాజు నెడ ♦ గాంచుతజనంబు లతి
గౌరవముభక్తి ననిశంబున్
నేతయుసుధర్మగతి ♦ నిఁ బోలఁగఁ బుడమి
నిఁ సతము నేలు తతిరక్తిన్.

సంపూర్ణము

